# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

శుభాకాంక్షలు
మాకు అత్యంత ఆప్తుడు
డాక్టర్ పెళ్ళకూరు రవీంద్రరెడ్డి గారికి
హృదయ పూర్వక శుభాకాంక్షలు
రొటేరియన్ డి.సి. హరిబాబు
11/10/1991 నెల్లూరు. ఫోన్ : 23649

# పులివెందలపై ఎందుకింత పట్టుదల?

అసమ్మతి నాయకుడు డాక్టర్ వై ఎస్ రాజశేఖర రెడ్డి రాజకీయ భవితవ్యం ఇప్పుడు ప్రధాని శ్రీ పివి నరసింహా రావు చేతిలో చిక్కుకున్నది. ముఖ్యమంత్రి పదవిపై ఎనలేని మమకారం పెంచుకున్న రాజశేఖర్ రెడ్డి ఢిల్లీ రాజకీయంలో గడపడానికి సుతారాము ఇష్టపడడం లేదు. అందువల్లే ఆయన పట్టుదల అంతా పులివెందుల స్థానానికి టిక్కెట్ తెచ్చుకోవడంపైనే కేంద్రీకృతమై వుంది. రేపు ( 12 తేది ) జరగబోయే కేంద్ర పార్లమెంటరీ బోర్డు సమావేశంలో దీనిపై ఒక నిర్ణయం జరగాలి. ఒక రకంగా ఇది రాజశేఖర రెడ్డికి అగ్ని పరీక్ష. పులివెందులలో తనకు, కడపలో తన తమ్ముడికి టిక్కెట్టు తెచ్చుకోగలిగితే, రాజశేఖర రెడ్డి పేరు మారుమ్రోగి పోతుంది.

కాని, ముఖ్యమంత్రి అంతతేలికగా రాజశేఖర రెడ్డి డంకాభజాయింపుకునమ్మతించడు. సాధ్యమైతే ఢంకాకు విర్లిగొట్టి శబ్దము రాకుండా చేస్తాడు. ఇప్పటికి ఆయన ఢిల్లీలో తనకున్న సర్వశక్తుయా, సకల సాధనాలూ ఈ కృషికి నియోగించాడు రాజశేఖర రెడ్డి సైతం తననభిమానించే ఎమ్మెల్యేలు, ఎమ్పి లందరినీ ఢిల్లీకి పంపాడు. అమేథీ తర్వాత,ఢిల్లీపెద్దలను చీకాకుపరుస్తున్న ఒకే ఒక స్థానం కడపే!

పులివెందుల టికెట్ రాకుంటే, వై ఎస్ స్వతంత్రుడుగా పోటీ చేస్తాడని తన తండ్రి రాజారెడ్డిని కడపలో నిలబెడతాడని ఒక ప్రచారం వుంది. ఇది అధిష్టాన వర్గాన్ని బెదరించడానికి వై ఎస్ అనుయాయులు చేస్తున్న ప్రచారమో లేక వై ఎస్‌ను అప్రతిష్టపాలు చేయడానికి ముఖ్యమంత్రి అనుచరులు పన్నిన పన్నాగమో తెలియదు. రాజశేఖర రెడ్డి అంత తొందర పడడని పరిశీలకుల విశ్వాసం. కాంగ్రెస్‌లో వుంటే ఆయనకు రాష్ట్ర నాయకుడిగా గుర్తింపు వుంటుంది. విభేదిస్తే పులివెందులకో, కడప జిల్లాకో పరిమితమై పోతాడు. ముఖ్యమంత్రి పట్టుదల వలంది. రాజశేఖర రెడ్డికి ఏ టిక్కెట్టూ రాకపోతే మాత్రం, పార్టీలోని యువతరంలో తీవ్రమైన అసంతృప్తి ప్రబలే ప్రమాదం వుంది. అది పార్టీకి, ముఖ్యమంత్రికి కూడా క్షేమం కాదు. ఎవరు అవునన్నా, ఎవరు కాదన్నా రాజశేఖర రెడ్డికి కడప జిల్లాలోనే కాక, రాష్ట్ర కాంగ్రెస్‌లోనూ ఫాలోయింగ్ వుంది. తాము అభిమానించే నాయకుడికి అవమానం జరిగితే వారు బాధపడడమో, తిరగబడడమో ఖాయం.

అయితే రాజశేఖర రెడ్డి తన మంకు పట్టుదల మాని, కడపలో పోటీచేసి కొంతకాలం ఢిల్లీ లో గడిపి రావడమే సముచితమని పలువురి అభిప్రాయం. పులివెందులలో గెల్చి వస్తే, ఆయనకు, ముఖ్యమంత్రికి మధ్య ముఖాముఖి పోరు ప్రారంభమౌతుంది. ఈ పోరులో ఒక వేళ విజయుడై జనార్దన రెడ్డిని దింపగల్గినా, ఛాన్సు ఆయనకు వస్తుందనుకోవడం భ్రమ. రాజశేఖర రెడ్డి ముఖ్యమంత్రిత్వానికి పార్టీలకతీతంగా నొంపుటితమై వ్యతిరేకం చేసే వర్గాలున్నాయి. ఒక వేళ ముఖ్యమంత్రి అయినా, ఆయన సాధించగల్గేదేమి వుండదు. ఆరునెలలకు మించి ప్రశాంతంగా బ్రతకనివ్వరు. రాష్ట్ర కాంగ్రెస్‌లో ప్రస్తుతం వున్న కలుషిత వాతావరణంలో పదవులు చేపట్టడం భవిష్యత్ వున్న రాజకీయ నాయకులకు క్షేమం కాదు. ( 5 రవ పేజీలో)


ఇద్దరు నాయకుల పేచీతో
పార్టీ భ్రష్టుపట్టిపోతూంది!

స్థాపితం : 1917

ఆహ్వానం

ఫోన్ : 26536




దినెల్లూరుకోఆపరేటివ్
అర్బన్‌బ్యాంక్‌లిమిటెడ్
నంబరు 2319
గాంధినగర్ (కో ఆపరేటివ్ సెంట్రల్‌బ్యాంక్
వెనుక వైపు) నెల్లూరు – 524 001.

–సేఫ్ డిపాజిట్ లాకర్ వసతి కలదు –


కె.వి. రమణయ్య
నెల్లూరు అర్బన్ బ్యాంకు
అధ్యక్షులు

స్వంత భవన ప్రారంభోత్సవం : 14.10.1991 ఉదయం 9.10నుండి10.30 గంటల మధ్య

గత 75 సంవత్సరాలుగా సింహపురి ప్రజలకు అపూర్వ సేవల నందించి బ్యాంకింగ్ వ్యవస్థలో ప్రగతి పథం వైపునడిచి, నెల్లూరు గాంధీనగర్‌లో నిర్మించు కొన్న స్వంత భవనంలోకి ఈ నెల 14న ప్రవేశిస్తున్న శుభసందర్భంలో మమ్ము ప్రోత్సహించిన ఖాతాదారులకు, డిపాజిటర్లకు శ్రేయోభిలాషులకు హృదయపూర్వక ఆహ్వానం తెలుపుతున్నాము.

| | | | |
|---|---|---|---|
| భవన ప్రారంభకులు : | ముఖ్యఅతిథి | స్ట్రాంగ్‌రూమ్,లాకర్ల ప్రారంభకులు | కౌంటర్ ప్రారంభకులు |
| శ్రీనల్లమల గిరిప్రసాద్ | శ్రీ కె.రాజు ఐ.ఎ.ఎస్ | శ్రీ వి. వీరరాఘవన్ | శ్రీ పి. రవిప్రకాశ్ |
| కార్యదర్శి : రాష్ట్ర కమ్యూనిస్టు సమితి | జిల్లా కలెక్టర్ – నెల్లూరు | జిల్లా మరియు సెషన్స్ జడ్జి–నెల్లూరు. | జిల్లా సహకార అధికారి |
| సహకార పతాకావిష్కరణ | మీటింగ్ హాల్ ప్రారంభకులు | సభాధ్యక్షులు | స్వాగతోపన్యాసం |
| శ్రీ గండవరం సేతురామిరెడ్డి | శ్రీ వి. అనంతరామయ్య | శ్రీ.జె.సి.యస్. అమర్‌నాథ్ | శ్రీ కె.వి. రమణయ్య |
| అర్బన్ బ్యాంక్ మాజీ ఉపాధ్యక్షులు | అర్బన్ బ్యాంక్ మాజీ అధ్యక్షులు | అర్బన్ బ్యాంక్ మాజీ అధ్యక్షులు | అర్బన్ బ్యాంకు అధ్యక్షులు |

అర్బన్‌బ్యాంక్ కార్యదర్శి శ్రీ పి.ఎస్. రామానుజాచార్యులు ; అర్బన్ బ్యాంక్ మాజీ ఉపాధ్యక్షులు : శ్రీ ఎస్.వి.శర్మ ; రాష్ట్ర అర్బన్ బ్యాంక్‌ల అసోసియేషన్ అధ్యక్షులు; కార్యదర్శులు శ్రీ గ్రంధి వెంకటేశ్వరరావు; శ్రీ ఎం. ఆంజనేయులు; రాష్ట్ర అర్బన్ బ్యాంక్ టౌన్‌బ్యాంక్ ఉద్యోగుల అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ వి. హనుమంతరావు గార్లు ఈ కార్యక్రమంలో పాల్గొందురు.

పాలకవర్గ సభులు : కె.వి. రమణయ్య – అధ్యక్షుడు, జె. గిరిజ ఉపాధ్యక్షురాలు, పి. శంకరయ్య, వేగూరు పురుషోత్తం, బి.ముక్కంటిరాజు, అరవ ఈశ్వరయ్య, షేక్ అహమద్ బాషా, యం.రామచంద్రయ్య, వి.రామరాజు, తుపాకుల సుబ్రహ్మణ్యం, టి. వరదయ్య ,అరిగెల నాగేంద్రసాయి – డైరక్టర్లు అరిగెల విజయకుమార్ – న్యాయ సలహాదారు

# ఉత్తర క్రియలు



మా ఇంటిదీపం,

## చిట్టమూరు శకుంతలమ్మ

3–10–91 తేది గురువారం బెంగుళూరులో స్వర్గస్తురాలైనది.

ఆమెకు దైవసాన్నిధ్యంలో చిరశాంతికలగాలని

ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము

వారి ఉత్తర క్రియలు

15–10–91 తేది మంగళవారం శిలాప్రతిష్ఠ

16–10–91 తేది బుధవారం శిలోద్వాసన (రేవు)

మాదరాజ గూడూరులోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము

చిట్టమూరు రామిరెడ్డి – భర్త

కుమారులు – కోడళ్ళు : కోదండరామిరెడ్డి – సుగుణ వెంకట్రామిరెడ్డి – హైమ

కుమార్తె – అల్లుడు : నూకలపాటి వేణుగోపాల్‌రెడ్డి – పద్మ

మరియు మనుమలు – మనుమరాండ్రు

# జమీన్‌రైతు

## ఎందుకీ ప్రభుత్వం ?

రాష్ట్రంలో రోజురోజుకీ పెరిగిపోతున్న నక్సలైట్ల అరాచకాలు, బందిపోట్ల ఆగడాలు, ఇతరత్రా జరుగుతున్న పలురకాల అకృత్యాలు చూస్తుంటే ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వమనేది వుందా అన్న సందేహం కల్గుతూంది. నక్సలైట్ల ప్రాబల్యం ఇదివరకు తెలంగాణాలోని నాలుగైదు జిల్లాలకు పరిమితమై వుండేది. ఇప్పుడు పలుకుబడి విస్తరించని జిల్లా రాష్ట్రంలోనే లేదు. నక్సలైట్ల పరిభాషలోని 'దోపిడీ'కి పెద్దగా ఆస్కారం లేని నెల్లూరు జిల్లాలోకూడా తీవ్ర వాదులు ప్రవేశించారు. రాపూరు, ఆత్మకూరు, వెంకటగిరి, ఉదయగిరి గ్రామాలలో రాడికల్స్ ప్రవేశించారు. కూలీరేట్ల పెంపు కోరమనడం ద్వారా మొదటగా వారు పేదలను ఆకర్షించబోతున్నారు. విప్లవ గీతాలాపనలో ఆ వెనుక బడిన గ్రామాల వారి జనవాడలు ప్రతిధ్వనిస్తున్నాయి. విజయవాడ మొగల్రాజపురంలో రాడికల్స్ బహిరంగంగా ప్రజాకోర్టు నిర్వహించారు. పట్టపగలు, అత్యంత రద్దీగా వుండే వీధులలో కోర్టు నిర్వహించి శిక్షలు విధించారంటే -పోలీసుయంత్రాగానికి సవాల్ విసరడం వంటిదే. ఆ వెంటనే, అదే ప్రదేశంలో ఒక పోలీసు సబిన్స్‌పెక్టర్‌ను రివాల్వర్‌లతో కాల్చిచంపి, నిర్భయంగా సైకిళ్లపై వెళ్ళారు. విజయవాడ అంటే, ఆంధ్రప్రదేశ్‌కులనదికార రాజధాని వంటి నగరం అటువంటి సిటీలో తీవ్రవాదులు ఇంత విచ్చలవిడిగా హత్యాకాండ కొనసాగించారంటే ప్రభుత్వమున్నా, పోలీసులున్నా వారికెంత భయంలేకుండా పోయిందో అర్థం చేసుకోవచ్చు.

తెలంగాణా జిల్లాల్లో పరిస్థితిచెప్పనే అవసరంలేదు. నక్సలైట్లు గీసిన గిరిలోనే పాలనా యంత్రాంగం నడుస్తున్నది. వారు సారాయి అమ్మడానికి లేదంటే అమ్మకూడదు. సినిమా హాలు తెరవడానికి లేదంటే మూత వేయాల్సిందే, పాఠశాలల్లోకి వచ్చి నక్సల్‌బరి సిద్ధాంతలు బోధిస్తే చచ్చినట్లు వినాల్సిందే; రేటు నిర్ణయించి చందాపంపమంటే, పంపితీరాల్సిందే. పోలీసులు తమ తమ స్టేషన్లు కాపలా కాచుకోవడానికే తంటాలు పడుతున్నారు. ప్రజల రక్షణకు వచ్చే సామర్థ్యం వారికి లేదు. తీవ్రవాదులు ఇంత అరాచకమయంగా వ్యవహరిస్తున్నా, పీపుల్స్ వార్ గ్రూపును నిషిద్ధసంస్థగా ప్రకటించడానికి గాని, సైన్యాన్ని దింపి అణచివేయడానికి గాని ప్రభుత్వనేతలు భయపడి చస్తున్నారు. వారికి నైతికబలం లేదు. ధైర్యం అసలేలేదు.

ఇంకొక ప్రక్క బందిపోట్ల దారిదోపిడీలు నిత్యకృత్యమై పోయాయి. నగరాల పరిహద్దులలో కుడా ఆర్‌టిసి బస్‌లు నిలిపి, దోచుకుంటున్నారు. లారీలు ఆపి, దౌర్జన్యాలుచేస్తున్నారు.

హరిజనులపైన, మహిళలపైన అత్యాచారాలకు అంతు,దరీ కన్పించడంలేదు. మహిళలను వివస్త్రలను చేసి ఊరేగించడం గ్రామాలలో పెత్తందార్లకు ఆట అయిపోయింది. వారిపై కఠినమైన చర్యతీసుకొనే వారులేరు. ప్రజల ప్రాణాలకు, ఆస్తులకు మానానికి రక్షణ కల్పించలేని ప్రభుత్వం వుండీ ఒకటే, లేకా ఒకటే. పోలీసు యంత్రాంగంలో మితిమీరిపోతున్న రాజకీయ జోక్యమే ఈ అనర్థాలకు కారణం. వచ్చిపోయే ప్రభుత్వాలు రాష్ట్రాన్ని అభివృద్ధిచేయనవసరంలేదు. కనీసం, శాంతిభద్రతలనైనా కాపాడ కుంటే, ప్రజలేమై పోవాలి? ఎవరి రక్షణ కోరాలి? పొరుగునేవున్న తమిళనాడులో, అత్యంతక్రూరులైన తమిళటైగర్లను నాలుగు నెలల వ్యవధిలో అణచివేసింది. జయలలిత. ప్రజలలో అపారమైన సానుభూతి; ప్రపంచ స్థాయి సంబంధాలు, అత్యంతాధునికాయుధాలు కల్గిన టైగర్లే పోలీసుల ప్రతాపంముందు పిల్లులైపోయారు. ఆమాత్రం చేవ, సాహసం మన రాష్ట్రపోలీసులకు, నాయకులకు ఎందుకు వుండదో అర్థం కావిషయం. సబిన్స్‌పెక్టర్ నుంచి, ఐజిపి స్థాయి వరకు అధికారులలో అత్యధికశాతం మంది అవినీతిలోనో, వ్యసనాలలోనో తమ శక్తి యుక్తులను నిర్వీర్యంచేసుకోవడంవల్ల, రాజకీయవాదుల చేతుల్లో కీలుబొమ్మలుగా మారడం వల్లనే ఆంధ్రులకు ఈ దౌర్భాగ్యం.

---

## జమీన్‌రైతు

10.10.41

10 పేజీలు – అణా

### రాపూరు పోస్టుమెన్

పల్లెల పోస్టుమెన్ సరిగ్గా గ్రామాల్లోకి పోవడంలేదని ఫిర్యాదు లొస్తున్నవి. " యదారాజా తదా ప్రజ " అన్నట్లున్నది అక్కడ వ్యవహారం. మొత్తంమీద బడివంతుళ్ళకు పోస్టుమేస్టర్ల పని తగలగట్టడం, పిల్లిమెడకు రొయ్యం మొంతాడు కట్టినట్లుంటుంది.

### వరగలి డాక్టరు

వీర్నగూర్చి చాలా గోలగా వుంది. ఇక్కడ యిలాంటి వారుండే దాని కంటే ఆసుపత్రిని మూయడమే బాగుటుంది. ఆ గ్రామంలో వుండే జి. బో మెంబరు గార్ని అడిగితే ఔను ! నిజమే నన్నేమి చేయమంటావు అని నిన్ను హసు తెలియజేస్తాడు. ఏం ప్రెసిడెంటు గారూ ! మీరన్నా విచారించరా ?

### గులిస్తాన్

ఇరాన్‌దేశీయుడు 'సాది' కవి పెరిషియన్‌భాషలో రచించిన "గులిస్తాన్" అనే కావ్యాన్ని కవి కోకిల దువ్వూరు రామిరెడ్డిగారు " గులాబితోట " అనే పేరుతో తెనిగించారనే సువార్త మీకు వినిపిస్తున్నాను. ఇదే కావ్యాన్ని జైల్లో కష్టపడి తెనిగించి పోగొట్టినాడట వృద్ధ వాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

### గెలిటే దొరా !

గూడూరు సడి బజారులో నిర్భందపు వసూళ్ళు జరుగుతున్న వని వార్త లొస్తున్నవి. స్వామీ తమకళ్ళ ఎదుట జరుగుతున్న నాటకాన్ని ఏమంటారు ! తెలియదంటారా ? విచారించండి అబద్ధమంటారా సాక్ష్యమిస్తారు. తీసుకోండి నిజమేనని అంగీకరిస్తారా ?

### ప్రకాశం పంతులు గోపాలరెడ్డిగార్ల సన్మానం

శ్రీ గోపాలు రెడ్డిగారు 7 తేది సాయంత్రం వచ్చిరి. దారిపొడుగునా అఖండసన్మానాలు జరిగినవి.

---

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

---

ఈ దినం ( 10.10.41 ) సాయంత్రం పై యిరువురికి జిల్లా బోర్డు వారు సన్మాన పత్రం సమర్పింతురు.

ప్రకాశం పంతులు ఈ దినం మద్రాసు నుండి వచ్చిరి. సా 5.30 లకు పై యిరువురి గౌరవార్థం పురమందిరాన టీపార్టీ జరుగును.

సా16 గం॥లకు టిప్పురాజా సత్రం వద్ద సభ జరుగును. ప్రకాశం పంతులుపున్నగు వారు మాట్లాడుదురు.

### నెల్లూరు ముచ్చట్లు

### ఖైదీని పాము కరచుట.

నెల్లూరు సబ్‌జైల్లో 9 తేది మధ్యాహ్నం మారుపూడి తిరిపాలు అనే ఖైదీని పులిపింజర అనే విష సర్పం కరచినది. చంపబడ్డ ఆపామును, ఆఖైదీని పెద్ద ఆస్పత్రికి తెచ్చారని, వెంటనే పొటాషియం పర్మాంగనేట్ వేశారని, తర్వాత అడ్మిట్ చేసుకున్నారని తెలుస్తున్నది.

పొటాషియం పర్మాంగనేటా పాము విషాన్ని దింపేది? రామ! రామ! ఆసుపత్రులు పాము చికిత్స లో నిస్సహాయ స్థితిలో మున్నవి.

ముచ్చిపాలిటీ వారికొక మనవి!– పాముల నర్సయ్య గారు సెప్ట్రె పాలిరెడ్డి పాలెంలో వున్నారు. వారిని జీతంమీద టవున్లో పెట్టి పాము విషం దింపించ వుంచరాదా ? ఆమోఘమైన మంత్రగాడే !

### చిత్తూరు నాగయ్యరాక

16.10.41 తేది కళానిలయము వారు నెల్లూరులో జరుపు " అహో" నాటకం, చిత్తూరు నాగయ్యగారి ఆధ్వర్యాన జరుగుతుందట.

సినిమాలోక నటాగ్రణులలో నకరని పేర్గాంచిన మనరాయప్రోలు శిష్యుని మనం గౌరవించడం సముచితంగదా !

### వర్షం

హస్త కార్తె మధ్యలో అంటే 3 తేది రాత్రిమొదలు 6 తేది వరకు మంచివర్షాలు కురిసినవి. నదులు వాగులు సమృద్ధిగా వచ్చినవి. పైర్లకు ముదురు అదును తప్పినా, లేత అదునుకైనా కొన్నిచోట్ల యీ వర్షం ఉపకరించవచ్చు. చిత్త కార్తె 10 తేది సాయంత్రం పడుతుంది. హస్తకార్తె రాత్రి రావడం, చిత్త కార్తె పగలు రావడం ఎక్కువ వర్షానికి సూచనంటారు కొందరు.

---

# భాగవతోత్తముడు పోతన

" ఘనుడు" రసిక్ గారిసదవిశ్లేషణ బాగుంది – కాళిదాసు భావుకుడు. పోతన భాగవతోత్తముడు. అద్భుత కల్పనా చాతుర్యం కాళిదాసుది – ఆయన మేఘాలతో దౌత్యం చేయగలడు. మేఘ సందేశం ఊహా జనిత కల్పనిక నాటకం. అది రసాత్మకం. ప్రేయసి ప్రియుల విరహంలో ప్రియుడు ఉన్మాది. ప్రతి కదలిక సందేశమే. భాగవతంలో పోతన గారి ఘనుడు వేద వేదాంగ పారాయణుడు. యుక్తి యుక్తంగా శాస్త్ర సాంగత్యం తో దౌత్యం సాఫల్యం.చేయగల ఘనుడు.

సాధ్వి ప్రౌఢ రుక్మిణి సందేహిస్తుంది. సంశయిస్తుంది. ఘనుడు భూసురుడు ద్వారకకుచేరి నాడా ? వార్ధక్య. వయోభారంతో మార్గాంతరమున విశ్రమించాడా! రుక్మిణి డోలాయమానవ ఉద్విగ్నమైనది. కృష్ణునికి పంపిన, సందేశంలో " అంకిల చెప్పలేదు " అడ్డుచెప్పను. చతురంగ బలంబుతో ..... శిశుపాల జరాసుతులన్ జయించి, క్షాత్రపరీక్షలో నెగ్గి, నావంకకు రమ్మని చెప్పిన క్షాత్రవ కాంత రుక్మిణి.

దౌత్యం సాఫల్యమైనది. బ్రాహ్మణుడు అగ్నిద్యోతనుడు, అనుకున్నది సాధించాడు. కృష్ణునికి రుక్మిణీ సందేశం విన్నవించాడు.

మరలకుండిన నగరానికి తిరిగి వచ్చాడు. అమ్మాయి రుక్మిణి ఎదురుతెన్నులు చూస్తుంది. "మెచ్చె భవద్గుణోన్నతి " అంటాడు. సందర్భాను సారంగా దౌత్యసాఫల్యం ఒక్క మాటలో ముగిస్తాడు. " ఆమేయధనావళులిచ్చెనాకు " అంటాడు. రెండవ మాట ముందు చెప్పవచ్చుకదా! కార్యసాఫల్యం దౌత్య విధి. విధి నిర్వహణలో బ్రాహ్మణుడు కృతకృత్యుడైనాడు – " నీకు ప్రత్యుపకారంగా ఏమి యివ్వగలను " అంటుంది. రుక్మిణి. ఏమైనా యిచ్చిన ప్రియుని ఔన్నత్యం దెబ్బతింటుంది. ప్రత్యుపకారంగా " అంజలి " గావించెదనంటుంది. రుక్మిణి. కథకు కథనానికి భాష్యం చెప్పగల భాగవతోత్తముడు పోతనామాత్యుడు.

వేల్పుల కామయ్య

బుచ్చిరెడ్డి పాళెం

## జనవాణి

### గ్రంథాలయ సిబ్బంది గోడు వినండి !

జనార్దన రెడ్డి గారు వ్యవసాయ మంత్రిగా ఉన్నప్పుడు నాలుగు సార్లు కలిశాం. మా విజ్ఞాపన విని "తప్పకుండా మిమ్మల్ని ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తిస్తాం. " అన్నారు. ఆతరువాత విద్యాశాఖ మంత్రిగా ఉన్నప్పుడు తిరిగి ఆయన్ను కలిశాము. అందరు ప్రభుత్వోద్యోగుల్లాగే గ్రాంట్సులో ఇవ్వండని ప్రాధేయ పడ్డాం.

వారు మా కోర్కెను మన్నించి తగినంత గ్రాంటు మంజూరు చేయించడం వల్ల నిన్నమొన్నటి వరకు సాఫీగా జరిగి పోయింది. తిరిగి జీతాలకోసం వెంపర్లాడాల్సి వస్తోంది.

ఇప్పుడాయన ముఖ్యమంత్రి . ఆ హోదాలో మమ్మల్ని కనికరించి ప్రభుత్వోద్యోగులుగా గుర్తించి, మా సంస్థకు అధ్యక్షుణ్ణి కూడా నియమించి గ్రంథాలయాల పురోభి వృద్ధికి సాయపడవలసిందని మనవిచేస్తున్నాము.

యం. వెంకటేశ్వర రావు,
అధ్యక్షులు. జిల్లా గ్రంథాలయ
సిబ్బంది యూనియన్.

నెల్లూరు.

### డిష్ యాంటెనాలుంచండి

ఇప్పుడు నెల్లూరులోని ఏసి. సినిమా హాల్‌లో ఫస్ట్‌క్లాస్ టికెట్ కొనుక్కుని సినిమా చూసిరావాలంటే , రానూపోనూ రిక్షా చార్జీలతో సహా 22 నుంచి 25 రూ॥ అవుతుంది. అందువల్ల డిష్ ఆంటెనా సినిమాలు తీసివేయవద్దని

కొరవ 8 పేజీలో

# శ్రీ శ్రీ కవితకే శీర్షిక అయిన పదసృష్టి - 'ఖడ్గసృష్టి'

మన సాహిత్యంలో ఉద్దండుడనిపించుకొన్న కవులలో వేములవాడ భీమకవి మొదటివాడు.

" వసియించు వేములవాడ భీమన భంగి ఉద్దండ లీల వాక్యోక్తిసమాడు..." అని శ్రీనాథుడొనరించిన ప్రస్తుతి భీమన కవితలో ఉద్దండత ముఖ్యమైన అంశంగా పరిగణించి ఆకట్టు కొనగలదన్న విషయాన్ని ప్రస్ఫుట పరుస్తుంది.

" వేముల వాడ భీమకవి పేరుని తిట్టును రిత్తవోవునే " అన్న పద్యం జగద్విదితం. అతని తిట్టూ వృథాపోదు. అతని మెచ్చుకోలూ వృథాపోదు. తెగడినా, పొగడినా, ఆ వాక్సిద్ధిగల కవివీరుడు ఆశుకవితా రూపంలో అప్పటి కప్పుడు ఉనహారా చేస్తాడు కాబట్టి అది వెంటనే ఫలిస్తుంది. కలకాలం ఆ ఆశుపద్యాలు, చాటువులు వాఙ్మయంలో నిలిచివుంటాయి. ఈ చాటు పద్యాలన్నీ అతని ఉద్దండ కవితకు చక్కని నిదర్శనాలే. ముఖ్యంగా 'మైలమభీముని' పరాక్రమాన్ని మెచ్చుకొంటూ, " గరళపు ముద్దలోహమునగాఢ మహాశని కోట్ల సమ్మెటల్ ...... " అంటూ ఆవీరుని ఖడ్గ సృష్టిని వర్ణించిన పద్యమత్యద్భుతమైనది. ఆ ఖడ్గ సృష్టి ఎలాజరిగిందంటే గరళపు ముద్ద లోహంకాగా, బెట్టిదములైన పిడుగుల వరంపరలు సమ్మెట పోటులుకాగా, ముక్కంటి మూడవ కన్ను కొలిమి కాగా, వాసుకి కోరలు పట్టుకార్లుకాగా, దిగ్గజము యొక్క కుంభస్థలము దాయిలేక దాగలి (Anvil) కాగా, అయకారుడు కమ్మరికాగా - జరిగినది. అట్లు సృజింపబడిన ఖడ్గమును చేబూనిన మైలమభీముడు " వైరి వీరవరాహరణధీరుడగుటలో వాశ్చర్యమేమి ? ఇంతటి ఉద్దండమైన వర్ణన లేక కల్పన లేక భావన మరెచ్చటా కానరాదేమో. ఆ ఖడ్గ సృష్టికి వెనుక గల " కమ్మరము " నా విధంగా తీర్చిదిద్దడం ఒక్క వేములవాడ భీమకవికే చెల్లింది. విలియంబ్లేక్ అన్న ఆంగ్లకవి తన "టైగర్" ("Tiger ") అన్న కవితలో " What the hammer ? What the chain ? In what furnace was thy brain? What the anvil ? What dead grasp Dare its deadly terrors clasp ? " అని వ్యాఘ్రపు సృష్టికి వెనుక నున్న కమ్మర మేధై వుంటుందా అన్న భీతావహమైన సంశయాన్ని వ్యక్తపరుస్తాడు. పాపం, బ్లేక్‌కు భీమన్నను చదువుకొనగం అవకాశం లేదుగదా. అయితే భీమన్నను ఆధునిక కవియైన శ్రీ శ్రీ బాగా చదువుకొన్నాడు. మైలమభీముని ఖడ్గ సృష్టిని గూర్చిన కవి భీమన్న పద్యం శ్రీశ్రీని బాగా కదలించినట్లుంది. ఆ " ఖడ్గసృష్టి " అన్న పదమే ఎంతో శక్తి వంతంగా, చైతన్యానికి ప్రతీకగా శ్రీశ్రీకి తోచింది. ఆయన తన కావ్యంలో ఒకదానికి ఖడ్గ సృష్టి అని నామకరణంచేసి అందులో భీమన పద్యాన్నిగూడ ఉదహరించాడు. శ్రీశ్రీసృష్టించిన ఎన్నో పదాలు, పదబంధాలు, అతని సమకాలిక రచయితల రచనలకు శీర్షికలుగా నిలిచాయి. అట్టి శ్రీ శ్రీ రచనకే భీమకవి పదసృష్టి యైన " ఖడ్గ సృష్టి " శీర్షిక కావడం ఆపదానికి, ఆ పదాన్ని దాచుకొన్న పద్యానికి గల 'సత్తువ' ను చాటి చెబుతున్నది.

**కవుల వలుకులు**

*

**రసిక్**

## సణుగుడు

### *ఉన్నమాటంటే అంత ఉలుకెందుకు?

రాజీవ్‌గాంధి విగ్రహ ప్రతిష్ఠాపనా ప్రహసనం వార్తలో తన గురించి చేసిన చిన్న ప్రస్తావనపై మునిసిపల్ చేర్మన్ శ్రీ రమేష్ రెడ్డి గతవారం ఇచ్చిన సుదీర్ఘ వివరణ చదివే వుంటారు. ఉన్న మాటంటే ఆయన కంత ఉలుకెందుకో అర్థంకాదు.

విగ్రహం పెట్టడం కోసం ఎసి పార్కు గోడలు బొంగించి, పోలీసు సహాయ కేంద్రం కట్టడాన్ని కూల్చి పారేసి, స్థలం రెడీచేసి అంత ప్రీత వినోదం చూస్తూ వుండిపోయింది : తనకు పెంచడానికి, కాపాడడానికి కృషి చేసి నందుకు జనార్దన రెడ్డికి ఎంచి గుణపాఠ మే జరిగిందన్నది ఆ వార్తలో సారాంశం ఇందులో వార్త ఎక్కడ దారుమార్చిందో అర్థం కావడం లేదు. శంకుస్థాపన రచ్చకు నాలుగు రోజుల ముందే ఎసి పార్కు గోడలు కూలగొట్టి, స్థలం రెడీ చేసింది వాస్తవం. ఆ పనిచేసింది అధికారులే తప్ప తాను కాదని, తనకు తెలియదని రమేష్ రెడ్డి సంజాయిషీ! ఎప్పుడైనా గోడలు కూలగొట్టేది అధికారులే! చేర్మన్ పార గడ్డపార పట్టుకొని తిరగడు; ఉత్తర్వు మాత్రం చేస్తారు, అంతే! అయితే, ఎవరు కూలగొట్టినా బాధ్యత మాత్రం చేర్మన్‌దే అవుతుంది. తనకు తెలియకుండా జరిగిందన్నది మరీ అమాయకపు నటన. రాజకీయంగా వివాదంలో వున్న ఒక విషయంపై అధికారులు చేర్మన్ కు

**డోలేంద్ర**

తెలియకుండా, తెల్పకుండా నిర్ణయాలు తీసు కుంటున్నారంటే - అది అసమర్థత అవుతుంది. చేర్మన్ అంటే లెక్కలేని తనం అవుతుంది!

జనార్దన రెడ్డి తనను కాపాడ డానికి ప్రయత్నం చేయలేదని రమేష్ రెడ్డి చెప్పున్నాడు. తనపై విచారణ జరిపిం చాడని ఆరోపిస్తున్నాడు. ముఖ్య మంత్రికి చేర్మన్‌పై ప్రేమ లేదంటే, అనివేదిక రమేష్‌రెడ్డి పదవి! ఈనాటికి ఉరిత్రాడై వుండేది. దర్యాప్తు జరిపిన అధికారులు

( కొరవ 10 పేజిలో )

# శ్రద్ధాంజలి

జననం : 1892 మరణం 1984

ప్రముఖ ఖద్దరు ధారి, అందరిచేత మంచి అనిపించుకొన్న నిష్కపటి, నిర్మొగమాటి, దామేగుంట సర్పంచ్‌గా, గ్రామ మునసబుగా, ఎం.పి.సి.ఎస్ ప్రెసిడెంట్‌గా ప్రజలకు ఎనలేని సేవ చేసిన ప్రేమమూర్తి

## దాసు అయ్యన్న శెట్టిగారు

స్వర్గస్థులై 17.10.1991 తేదికి ఏడు సంవత్సరములు

వారి ఏడవ వర్ధంతి సందర్భంలో

మాశ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

దాసు సుబ్బరామయ్య – కుమారుడు

దాసు సరోజనమ్మ – కోడలు

ఇండ్ల వనమ్మ – కుమార్తె

ఇండ్ల వెంకయ్య – అల్లుడు

మరియు మనుమలు, మనుమరాండ్రు

# సబ్బుబిళ్లకు గతిలేని పేదదైపోయిందా పెద్దాస్పత్రి?

నమ్మండి. నమ్మకపోండి! నెల్లూరు పెద్దాస్పత్రిలో డాక్టర్ల చేతులు కడుగుకోవడానికి సబ్బు బిళ్లలేదు ; రోగులకు బిపి చూడడానికి, బిపి ఆపరేటస్‌లేదు ; బాత్‌రూమ్‌లు శుభ్రంచేయడానికి ఫినాయిల్ లేదు. అయినా అది " పెద్ద" ఆస్పత్రిగానే పరిగణన అవుతున్నది. రోగులకు వైద్యం చేస్తూనే వుంది.

సాక్షాత్తు ముఖ్యమంత్రి స్వంత జిల్లా అయిన నెల్లూరులో అభివృద్ధి కార్యక్రమాలకు రమారమి ఏటా వందకోట్ల ఖర్చుపెడుతున్న జిల్లాకేంద్రంలో, నాలుగు లక్షల జనాభావున్న ఇంత పెద్ద పట్టణంలో ఒక ప్రభుత్వాస్పత్రి సబ్బుబిళ్లకు కూడా గతిలేని దరిద్రం కారుస్తున్నదని, దౌర్భాగ్య పరిస్థితులలో నడుస్తున్నదని చెప్పాలంటే సిగ్గుచేటు గానే వుంది. ఈ వార్త పొరుగు జిల్లా వారు చదివితే నవ్విపోతారనే సందేహం కల్గుతున్నది. కాని వాస్తవ పరిస్థితిమాత్రం అదే.

ఎవరో చెప్తే వ్రాస్తున్న మాట కాదిది. ఈ విలేకరి స్వానుభవంతో చెప్తున్న నిజం. 8 తేది ఉదయం ఆస్పత్రికి వెళ్తే డాక్టరైతేవున్నారు ! కాని ఆయన దగ్గర వైద్యపరికరాలేవీ లేవు. బిపి ఆపరేటస్ తెమ్మని నర్సును పురమాయించాడు. లేదని సమాధానమిచ్చిందామె. ఏదో ఒక వార్డులో వుంటుంది. తెమ్మన్నాడు - అరగంట తర్వాత, ఎక్కడా దొరకలేదని, ఏవార్డులోనూ ఆ పరికరమన్నదే లేదని తిరిగి వచ్చిందామె. బిపి చూడకుండానే వైద్యపరీక్ష చేసేశాడా అపర ధన్వంతరి. అంతా అయ్యాక చేతులు కడుక్కోవడానికి వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్తే

**సింహపురి**

సబ్బు లేదు -

చిన్న బిళ్ల అయినా సంపాదించమని నర్సుని బ్రతిమలాడినా ఫలితం లేకపోయింది. పాపమా డాక్టరు సిగ్గుపడి తలవంచుకొని వెళ్ళి పోయాడు.

బాత్ రూమ్‌లు చూస్తే ముక్కులు పగిలే కంపు. క్లీన్ చేసే వాడేలేడు. చేయడానికి ఫినాయిల్ స్టాకులేదట. గాయాలు శుభ్రం చేయడానికి స్పిరిట్ స్టాకు అయిపోయిందట. సబ్బుబిళ్ల, స్పిరిట్ ఫినాలేని ఆస్పత్రిలో మందులు, మాకులు వుంటాయని అనుకోగలమా?

ఆస్పత్రికి కేటాయింపబడే లక్షల నిధులు ఏమై పోతున్నాయి? సూపరింటెండెంట్ గారు ఏమి చేస్తున్నారు ? ఆస్పత్రిలో కనీస సదుపాయాలు వున్నదీ లేనిదీ చూడడానికి కూడా చేతకాని చచ్చు దద్దమ్మలు, ఆస్పత్రిలో పెత్తనం చేసే పదవుల్లో కూర్చోవడం ఎందుకు? జీతాలు, గీతాలు కలిపి దిగమ్రింగ డానికా?

వైద్య మంత్రి గారువుంటేఆస్పత్రులనుంచి వచ్చే మామూళ్లు సరిగ్గా వసూలైనాయా లేదా అని సరిచూసుకోవడానికే సమయం చాలుతున్నట్లులేదు. కనీసం ముఖ్యమంత్రి గారైనా, తన పరువు నిల్పుకోవడం ఈ ఆస్పత్రి దరిద్రాన్ని వదిలించకూడదా ! ప్రభుత్వానికి గతి లేదంటే చెప్పండి - ప్రజలే చందాలు వేసుకొని ఫినాయిల్ కొనిస్తారు; లేదంటే డాక్టర్లు , సిబ్బందికి వంతుల వారిగా డ్యూటీలు వేసి బ్రంకురోడ్డులో కూర్చోబెడితే ! సబ్బుబిళ్ల మోయనభిక్షం వేస్తారు.

( కొరవ 10 పేజిలో)

# రాజకీయనాటకంగా మారిన చోరికేసు అరెస్ట్

రెండు వారాలలోపలే యూత్ కాంగ్రెస్ నాయకుడు కోటంరెడ్డి విజయ కుమార్ రెడ్డి మరొక సారి పత్రికలకెక్కాడు. అధికారంలో వుండే వారితో స్నేహితం చేయడం కంటే, ఒక్కొక్క సారి శత్రుత్వం పెంచడమే రాజకీయంగా ప్రయోజనం కల్గిస్తుందేమో ! రాజీవ్ గాంధీ హత్యా కేసులో 30 లక్షల వరకు సంగ్రహించిన నెల్లూరు ప్రసాద్ అనే నెల్లూరీయుడికి అతడి బంధువు శ్యామ్‌సన్‌కు విజయకుమార్‌రెడ్డి కొంతకాలం రక్షణ కల్పించాడని, ఇందిరాభవన్ మిద్దెపైన గదులలో దాచి వుంచాడని అప్పట్లో ఆరోపణలు వచ్చాయి. శ్యామ్‌సన్‌ను పోలీసులు అరెస్టు చేయగానే, విజయకుమార్ రెడ్డి పెళ్లి

## విజయకుమార్‌రెడ్డికి రెండందాలా లాభమే!

ప్రతిష్టాపనా ప్రచారంతో విజయ కుమార రెడ్డి మొదటి సారిగా వెలుగులోకి వచ్చాడు. సిబిసిఐడి అధికారుల చేత అరెస్ట్ కాబడి ఇప్పుడు వార్తలకెక్కాడు విజయకుమార్ రెడ్డి. నాదాం ఆశ్రమంలో ... టి 70 లక్షల సామా... కి సంబంధం వుందని మొదట ... సిబిసిఐడి అధికారులకు అనుమానం. చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగావున్నప్పుడు ఈ కేసు వెలుగులోకి వచ్చింది. నాదాం చోరీ విడిపించడంతో ఈ ఆరోపణలకు బలం చేకూరింది. అయితే చెన్నారెడ్డితో అతడికి వున్న సన్నిహిత సంబంధాల దృష్ట్యా పోలీసులు అతడి జోలికి వెళ్లలేక పోయారు. జనార్దన రెడ్డి ముఖ్యమంత్రి అయిన వెంటనే సిబిసిఐడి ఎస్‌పి శ్రీ నాగరాజా విజయకుమార్ రెడ్డిని పిలిపించి విచారించాడు. ఆ తర్వాత ఆకేసు పరిశోధన మూలపడిపోయింది. నెల్లూరులో ఎ ఎస్‌పిగా పనిచేసి వెళ్లిన శ్రీ భాస్కరయ్య డిఐజిగా నియమితుడు కాగానే ఈ కేసును కదిలించారు. నెల్లూరు ప్రసాద్ ఆచూకీకి సంబంధించి ఖచ్చితమైన సమాచారం విజయకుమార్ రెడ్డి దగ్గరుందని వారి అనుమానం దావిశీతోడు అతడిముఖ్యకొత్త మారుతీకారు, ఒక ఇల్లు కొన్నాడని వారికి తెలిసిందట. నాదాం డబ్బే పెట్టుబడిగా వాడాడనే అనుమానంతో సిబిసిఐడి అధికారులు 8 తేది ఉదయం అతడి ఇంటిపై దాడిచేశారు. ఆ సోదాలో పోలీసులు ఇదివరకే శ్యామ్‌సన్ నుంచి స్వాధీనం చేసుకున్న ట్రాక్టర్ తాలూకు కాగితాలు అతడింట్లో దొరికాయట. ఈ ఆధారంతో అధికారులు అతడ్ని అరెస్ట్ చేశారు.

అయితే స్థానిక పోలీసుల సహకారం అవాలో, లేక చేత కానితనం అవాలో తెలియదు కాని ఈ అరెస్ట్‌ను సైతం విజయకుమారరెడ్డి రాజకీయంగా వాడుకున్నాడు. పత్రికలలో విశేష ప్రచారం సంపాదించాడు. విజయ కుమార రెడ్డిని అరెస్ట్ చేయడానికి 100 మంది పోలీసులు కావాలని ఎవరునిర్ణయించారో

కొరవ 7వ పేజీలో

## జిల్లావార్తలు

### నవోదయ ప్రవేశ పరీక్ష

92 వ సంవత్సరానికి కృష్ణాపురం జవహర్ నవోదయ విద్యాలయంలో 6 వ తరగతి లో చేరుటకు 8.3.92 వ తేది ప్రవేశ పరీక్ష నిర్వహించబడుతుంది.

పై పరీక్షకు ప్రస్తుతం 5 వ తరగతి చదివే పన్నెండేళ్ల లోపు విద్యార్థులకు అర్హత ఉంటుంది.

దరఖాస్తులు మండల విద్యాశాఖాధికారులనుండిగాని, జిల్లా విద్యాశాఖాధికారినుండి గాని 13.11.91 లోగా పొందవచ్చును. పూర్తిచేసి తిరిగి మండల విద్యాశాఖాధికారులకు 18.11.91 లోగా ఇవ్వవలసి ఉంటుంది.

### వాశిలి లో వనమహోత్సవం

గాంధీ జయంతి నాడు వాశిలి గ్రామంలో నెల్లూరు జి.ప్ర.ప.డిడిఒ శ్రీ సతీష్ చంద్ర ఆధ్వర్యంలో సంపూర్ణ అక్షరాస్యతా కార్యక్రమానికి అనుసంధానంగా వనమహోత్సవ కార్యక్రమం కడు వైభవంగా జరిగింది. ఆత్మకూరు మండల ప్రజాపరిషత్, మండల రెవెన్యూ సిబ్బంది తో పాటు జిల్లా అటవీ శాఖ సిబ్బంది కూడా పాల్గొన్నారు. సెంట్రల్ ఎడ్యుకేషనల్ కమిటీ తరఫున వీడియో తీయడంతో ఈ ఉత్సవం ప్రజలకు ఒక పండుగగా తోచింది.

మొదటగా గ్రామంలో అక్షరాస్యతా కార్యక్రమంపై ర్యాలీ జరిగింది. తరువాత గ్రామానికి చెందిన స్త్రీలు, పురుషులు బిందెలు, హారంతో వచ్చి, ఫారెస్టు డిపార్టు మెంటు వారిచ్చిన టెంకాయ చెట్ల మొక్కలను దంపతులుగా పాల్గొని, గ్రామం మధ్యలో ఉన్న కోనేరు చుట్టూ నాటారు. గ్రామస్తులకు టెంకాయ చెట్ల మొలకలు, జామాయిల్, తురాయి, సుబాబుల్ మొక్కలు ఫారెస్టు డిపార్టుమెంటు వారు పంచిపెట్టారు.

అక్షరాస్యతనుగూర్చి కళాకారులు నాటికలు ప్రదర్శించారు. ఒక తిరునాళ్ల మాదిరి గ్రామములోని జనాన్ని కూడగట్టి ఈ ప్రజావందనము నిర్వహించిన ఉపసర్పంచ్ శ్రీ గంగా శ్రీనివాసుల్ని డిడిఒ అభినందించారు.

### వెంకటగిరిమండలాఫీసు వాచ్ మాన్ లేదు!

గత పెండ్రోజులుగా వెంక... మండల ప్రజాపరిషత్ కార్యాలయంలో

కొరవ 8 వ పేజీలో

# ఉత్తర క్రియలు

నాధర్మపత్ని

## డేగా శాంతమ్మ

3-10-91 తేది బేస్తవారం స్వర్గస్థురాలైనది.
ఆమె ఆత్మకు చిరశాంతి కలగాలని
భగవంతుని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిసున్నాము.
ఆమె ఉత్తర క్రియలు
18-10-91 తేది శుక్రవారం శిలాప్రతిష్ఠ
19-10-91 తేది శనివారం శిలోద్వాసన
నెల్లూరు , వేదాయపాళెం, జ్యోతినగర్
గోడౌన్స్ సమీపం మా ఇంటిలో జరుగును.
బంధుమిత్రులు తెలియ గోరుతున్నాము.
డేగా కోదండ రామరెడ్డి – భర్త

కుమారులు – కోడళ్ళు : సుధాకర్ రెడ్డి – జ్యోతి, దయాకర్ రెడ్డి – ముంజుల , మునీంద్ర రెడ్డి – సులోచన
కుమార్తె – అల్లుడు : దేవసేన – డా। పూండ్ల శ్రీనివాసులు రెడ్డి
మనుమళ్ళు – మనుమరాళ్ళు : శాలిని, సరిత, సుకుమార్, శివ ప్రసాద్, సునీల, శివసందీప్, సతీష్

Door No : 26 / 2889, Nellore - 524 004 Phone : 26219

# నెల్లూరు రచ్చబల్లి

విశాఖకుడు

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి నవంబర్ 15వతేదీ నెల్లూరు రావచ్చు. ఈ ఎన్నికల కార్య భారం నుంచి ఆటవిడుపు దొరికితేనే, ఈ కార్యక్రమం ఖరారౌతుంది.

### మంత్రిజానకిరాం

జిల్లా మంత్రి శ్రీ మాదాల జానకిరాం 9 తేది ఉదయం నెల్లూరు వచ్చారు. ఉదయగిరి ప్రాంతంలో విస్తృతంగా పర్యటిస్తున్నారు. రాత్రి మకాం కూడా అక్కడే. ఒంగోలు ఎం.పి శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి కూడా ఆయన తోటే తిరుగుతున్నారు. 13వ తేది తిరిగి హైదరాబాద్ వెళ్ళవచ్చు.

### జె.కె. కి సన్మానాలు

రాష్ట్ర పబ్లిక్ అండర్ టేకింగ్స్ కమిటీ ఛైర్మన్ శ్రీ జె.కె.రెడ్డికి నెల్లూరులో సన్మాన సభలు జరుగుతున్నాయి. జంట కవి ఆనాలో, లేక తోడిపెండ్లి కొడుకు అని పిలవాలో కాని - ఆనం వివేకానంద రెడ్డి కూడా ప్రతి సన్మాన సభలోనూ ప్రక్కనే నిలబడి, తమూ ఒక పూలమాల వేయించు కుంటున్నాడు.

గడిచిన వీధిలో జె.కె. అనుచరగణ ప్రథముడు షేక్ మొహిద్దీన్ 6 తేది సన్మాన సభ జరిపాడు. తన పదవికి హోదా లేదని, పనిచేయడమే హోదా అని చెప్పారు శ్రీ జె.కె. మద్రాసు బస్టాండు ఆవరణలో నిర్మించ బోయే ఏసి కూరగాయల మార్కెట్‌ను రాష్ట్రంలోనే ఆదర్శ వంతమైనదిగా తీర్చిదిద్దు తామన్నారు.

### మంత్రి సముదు సిపి

మంత్రి సముదు, శ్రీ సిపి శేషారెడ్డి విప్ హోదాలో తన నియోజక వర్గంలో పర్యటిస్తున్నాడు. ఎమ్మెల్యేగా ఎక్కువ కాలం అనధికార విప్‌గా హైదరాబాద్‌లో గడిపిన సిపి, అధికార విప్‌గా నెల్లూరు లోనే వుండి పోవడం విశేషమనుకుంటే, విశేషమే!

### మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలి సస్పెన్షన్

నెల్లూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ మహిళా విభాగం అధ్యక్షురాలు శ్రీమతి వి. పాల్‌ను పార్టీ నుంచి ,పదవి నుంచి సస్పెండ్ చేశారు. ఆమె ఇంట్లో పనిమనిషిగా వుండిన భారతి అనే యువతి హత్యకు గురి కావడంతో ఈ చర్య తీసుకున్నారు.

### డేగా కేసు

కోర్టు ఉత్తర్వుల ప్రకారం తాను చేసిన బదిలీలను డిడిఒ శ్రీ సతీష్‌చంద్ర రద్దు చేయడంపై జిప్రప ఛైర్మన్ శ్రీ డేగా నారసింహారెడ్డి హైకోర్టులో కోర్టు ధిక్కరణ నేరం ఆపాదిస్తూ కేసు దాఖలు చేశారు. అయితే సతీష్ చంద్ర స్నేహితులైన ఇతర ఐఎఎస్ అధికారులు ఛైర్మన్‌ను ఒప్పించి, కేసు ఉపసంహరణకు ప్రయత్ని స్తున్నట్లుంది.

### రాజీవ్ విగ్రహం – 23న శంకుస్థాపన

వినియోగదారుల ఫోరం స్టే ఉత్తర్వు వల్ల నిల్చి పోయిన రాజీవ్ గాంధి విగ్రహం శంకుస్థాపన 23 తేది జరుప బోతున్నట్లు విజయ కుమార రెడ్డి ప్రకటించాడు. ఆమేరకు అతడికి హైకోర్టు అనుమతి లభించింది. ఉయ్యాల కాలువ ప్రవాహానికి అంతరాయం కలుగ కుండా విగ్రహం పెట్టుకోమని హైకోర్టు సూచించింది. కాలువ రెండు ప్రక్కలా వుండే గోడలపై కాంక్రీట్ బీమ్ పోసి, గోడలు ఎత్తుపెంచి, స్లాబ్ పోసి, దానిపై విగ్రహం పెట్టాలని విజయ కుమార రెడ్డి ప్రయత్నం. అందుకు పి.డబ్ల్యుడి శాఖ ఎంత వరకు అనుమతిస్తుందో మనకు తెలియదు.

మొత్తానికి ఈ రావణ కాష్టం ఇప్పట్లో చల్లారేట్లు లేదు.

### రాపూరు పల్లెల్లో నక్సలైట్ల మకాం

రాపూరు పల్లెల్లో నక్సలైట్లు ప్రవేశించారు. దాదాపు 3 నెలల నుంచి ఒక పథకం ప్రకారం వీరు ఎంపిక చేసిన గ్రామాలలో విహరిస్తున్నారు. గ్రామానికి ఇద్దరు లెక్కన వుంటున్నారట. కూలి రేట్ల పెంపుపై ప్రజలను చైతన్య వంతులను చేయడమే వీరి ప్రస్తుత కార్యక్రమం. పేదలను, ముఖ్యంగా హరిజనులను ఈ విషయంలో వీరు ఎడ్యుకేట్ చేస్తున్నారు. ఘర్షణ ధోరణిలో కాక, సామరస్యంగానే రైతులతో చర్చలు జరిపి, ఎక్కువ కూలి సాధించు కోమని కోరుతున్నారట. కొన్ని గ్రామాలలో ఆ ప్రయత్నం ఫలించింది. ర్యాడికల్స్ జోక్యం వుందని తెలియడంతో రైతులు కూడా పెద్దగా పేచీలకు దిగడం లేదు. కూలీరేట్లు పెరగడంతో, పేదలు సహజంగానే ర్యాడికల్స్‌ను తమ గ్రామాలకు ఆహ్వానిస్తున్నారు. ...గ్రూపుల రాజకీయ పాఠాలు, విప్లవ గీతాలాపన జరుగు తున్నాయి. ఫారెస్ట్ శాఖకు చెందిన విషయంలో మాత్రం ర్యాడికల్స్ తమ రైతు కూలి సంఘం ద్వారా నేరుగా చర్చలు జరిపి, దిన కూలి రేటు పెంచారు.

వరంగల్ నుంచి వచ్చిన ఒక పీపుల్స్ వార్ దళనాయకుడు నెల్లూరులో వుండి వీరందరినీ సమన్వయ పరుస్తున్నాడని తెలుస్తున్నది. ఈ దళనాయకుడు న్యాయవాది. పోలీసులు ఎందు వల్లనో వీరి కార్య కలాపాలలో జోక్యం చేసుకోవడం లేదు. కాని రైతాంగంలో మాత్రం తీవ్రమైన భీతావహ పరిస్థితులు నెలకొని వున్నాయి.

### ఫోటో స్టూడియోలో యువతి ఆత్మహత్య

నెల్లూరు దర్గామిట్ట పోస్టాఫీసు సమీపంలోని ఒక ఫోటో స్టూడియోలో శోభారాణి అనే పదిహేడేళ్ళ యువతి ఆత్మహత్య చేసుకున్నది. ఆ ఫోటో స్టూడియో యజమానితో ఆమెకు సంబంధం వుందట. పెళ్ళి చేసుకుంటాడనే ఆశతో ఆమె అందుకు సమ్మతించినట్లుంది అయితే ప్రణయం తప్ప పరిణయానికి అత డంగీకరించకపోవడంతో జీవితంపై విరక్తి చెంది, 4తేది ఉదయం స్టూడియోలోనే పురుగుల మందు త్రాగి ఆత్మహత్య చేసుకున్నదట.

ఈ కేసుపై పోలీసు చురుకుగా వ్యవహరించడం లేదని ఆరోపణ - ఏ కేసుపై చర్య తీసుకుంటున్నారు. వారు?

### హత్యకేసు త్రోసివేత

కలువాయ మండలం వెదన పర్తి గ్రామంలో 1989 ఫిబ్రవరి 5తేది ఎ. కామాక్షయ్య అనే రైతును హత్య చేశారనే నేరంలో ముద్దాయిలు నలుగురినీ నిర్దోషులుగా గుర్తిస్తూ జిల్లా అడిషనల్ జడ్జి శ్రీ అంజనేయులు తీర్పు చెప్పారు. ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా అడిషనల్ పిపి శ్రీ పురి బలరామయ్య ముద్దాయిల పక్షంగా న్యాయవాదులు వల్లం రెడ్డి విజయ కుమార్ రెడ్డి . వి. పద్మజా, పి. సామ్ వాదించారు.

### ఆర్ ఎం ఎస్ నిరసన

ఆర్ ఎం ఎస్ ఉద్యోగుల సంఘాల సంయుక్త కార్యాచరణ కమిటి ఆధ్వర్యంలో ఇటీవల ఉద్యోగులందరూ నిరసన ప్రదర్శన జరిపారు. శ్రీరఘురాం ఈ ప్రదర్శనకు నాయకత్వం వహించాడు

నెల్లూరులో ఎమ్.ఆర్.ఎఫ్ సాంకేతిక సహకారంతో నెలకొల్పిన యస్.ఎమ్.యస్. ఎంటర్‌ప్రైజెస్ టైర్ రిట్రెడింగ్ ఫ్యాక్టరీకి స్విచ్ ఆన్ చేస్తున్న ఒంగోలు ఎం.పి. మాగుంట సుబ్బరామిరెడ్డి

### చిత్రకళ పోటీలు

జిల్లా గ్రంథాలయ సంస్థ ఆధ్వర్యంలో 16తేది ఉదయం 9గంటలకు చిత్ర కళపోటీలు జరుగుతాయి. గెల్చిన వారికి ముని ఆర్ట్స్ శ్రీముని కుమార్ నాయుడు మెమొంటోలు బహుకరిస్తారు. వివరాలకు లైబ్రరీ కార్యదర్శిని అడగండి! ఈ సంస్థ ఆధ్వర్యంలోనే 30 తేది సాయంత్రం మిమిక్రీ పోటీలు కూడా నిర్వహిస్తున్నారు.

### కేతిరెడ్డి విద్యాపీఠం — సార్థక సాహిత్యసేవ

మద్రాసు నవయుగ హోటలు నెల్లూరు నర్తకి థియేటరు అధిపతి శ్రీ కేతిరెడ్డి హరిప్రసాద రెడ్డి 1987 లో పేద విద్యార్థులకు ఉపకార వేతనాలు, ఉత్తమరచనలు ప్రోత్సహించే ధ్యేయంతో నెలకొల్పిన కేతిరెడ్డి విద్యాపీఠం ఇప్పుడిప్పుడే నడక ప్రారంభించింది. ఇంతవరకు మద్రాసు విశ్వవిద్యాలయం లో తెలుగు ఎం.ఎ., ఎంఫిల్., పిహెచ్.డి. లలో ప్రతిభ నిరూపించుకున్న15 మంది విద్యార్థినీ విద్యార్థులకు రూ 500 చొప్పున, విడవలూరు కాలేజి విద్యార్థులకు రూ 500,250 చొప్పున ఏటా పదివేల రూపాయలు ఇస్తున్నారు. ఇప్పుడు కవి కోకిల దువ్వూరు రామిరెడ్డిగారి రచనలన్నిటి పునర్ముద్రణకు సంకల్పించి మొదటి కుసుమంగా 'పానశాల'ను ప్రకటించింది.

ఖరీదైన కాగితం . ఆకర్షణీయమైన ముఖ పత్రం రేఖా చిత్రాలలో కూడిన ముచ్చటైన ముద్రణలో అలరారు తూ పునర్ముద్రితమైన ఈ కావ్యం ముద్దులొలుకుతున్నది. దువ్వూరి రామిరెడ్డిగారు కవే కాదు, మంచి చిత్రకారుడుకూడా. అందువల్లనే తన 'పానశాల 'ముఖ పత్రాన్ని, తన భావాలకు వూహలకు అనుగుణంగా తానే చిత్రించుకున్నారు. అది పారశీక శిల్ప సంస్కృతులను ప్రతిబింబించేదిగా వుండేది. కేతిరెడ్డి విద్యాపీఠం వారు తమ పునర్ముద్రణకు ఆధునాతనమైన ప్రక్రియలో దానినే యథాతథంగా స్వీకరించి వుంటే బాగుండేది. లోపల బొమ్మలు ఏ రంగులో వేసినా పద్యాలను నలుపులోనే అచ్చువేయించివుంటే ఇంకా ఆకర్షణీయంగా వుండేదనిపిస్తుంది.

యువకుడు . వ్యాపారరంగంలో వున్న కేతిరెడ్డి హరిప్రసాదరెడ్డి విద్యాసాహిత్యాభిరుచులు కలగడం అభినందనీయం. నెల్లూరులో వున్న కవి కోకిల ' జయంతి సంఘం కూడా తలపెట్టని, కవి కోకిల రచనల పునర్ముద్రణా కార్య భారాన్ని వహించిన హరిప్రసాద రెడ్డి ప్రశంసనీయుడు; ఆయన సంసద సేవలుసార్థకం చెందుతున్నాయి.

### అర్బన్ బ్యాంక్ భవన ప్రారంభం

రాష్ట్రంలోనే ఉత్తమమైన దిగా పేర్కొనదగిన నెల్లూరు సహకార అర్బన్ బ్యాంకు స్వంత భవనం సమకూర్చుకున్నది. గాంధీనగర్‌లో పాత ఎన్‌జిఒ కార్యాలయం భవన స్థలం కొని, తమ అవసరాలకు అనుగుణంగా పునర్నిర్మించుకున్నారు. 14 తేది ఉదయం పిపి ఐ నాయకుడు నల్లమల గిరి ప్రసాద్ రిబ్బను కత్తిరిస్తారు.

తన అధ్యక్ష పదవీ కాలంలో బ్యాంకుకు మంచి భవనం సమకూర్చ గలగడం, కె వి రమణయ్య అదృష్టం.

### నెల్లూరు జిల్లాలో రసాయన పరిశ్రమ

నెల్లూరు జిల్లాలో ఒక భారీ రసాయన కర్మాగారం నిర్మించ డానికి కేంద్ర

( కొరవ 7వ పేజిలో)

INVEST IN THE BEST
ONIDA
TVS , V.C.R's
JVC JAPAN
VISIT FOR THE BEST
Authorised Dealers
SRI DEVI AGENCIES
Near Corporation Bank
Trunk Road, NELLORE.
PHONE : 25994
ONIDA 21
ప్రభుత్వోద్యోగులకు సులభ వాయిదాల పద్ధతిపై ఏర్పాటు చేయబడును.

పిలుస్తోంది మంజు – పసందైన విందుకు
న్యూమంజు హోటల్ ఎ.సి
వెజిటేరియన్ మరియు నాన్‌వెజిటేరియన్
రాధా థియేటర్ ఎదురుగా
బొమ్మలగడ్డ వారి వీధి - నెల్లూరు.
మా పసందులు : చికెన్ కబాబ్, చికెన్ సిక్సర్

## నెల్లూరు ముచ్చట్లు

(6 వ పేజీ తరువాయి)

ఏనుపులమంత్రి శ్రీ వెంకటమోహన్ ప్రయత్నిస్తున్నట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. కేంద్ర ప్రభుత్వ రంగంలోని హిందూస్థాన్ ఆర్గానిక్ కెమికల్ వంటి సంస్థల ద్వారా ఈ పరిశ్రమ ఏర్పాటయ్యే అవకాశం వుంది. ఈ ప్రయత్నం ఫలిస్తే జిల్లాలో తొలి భారీ పరిశ్రమ అదే అవుతుంది. ప్రతిపాదన పరిశీలన స్థాయిలోనే వుంది. కాబట్టి అవతరణలోకి వచ్చే వరకూ చాలా కాలం పట్టవచ్చు.

### వెంకటగిరిలో పోలీసు బెటాలియన్

వెంకటగిరి సమీపంలో ఒక పోలీసు బెటాలియన్ నెలకొల్పడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. 400 ఎకరాల స్థలంలో ఏర్పాటయ్యే ఈ బెటాలియన్లో నెల్లూరు, చిత్తూరు జిల్లాల అవసరాలు తీర్చే స్థాయిలో పోలీసులను నియమిస్తారు. వెయ్యిమంది పోలీసులకు గృహ వసతి కల్పిస్తారు. గన్ షూటింగ్ శిక్షణకు వసతులు కల్పిస్తారు. ఇప్పటి వరకు నెల్లూరుకు అవసరమయ్యే అదనపు పోలీసు సిబ్బందిని మంగళగిరి నుంచి పిలిపిస్తున్నారు.

ముఖ్యమంత్రి శ్రీ ఎన్ జనార్దన రెడ్డి వ్యక్తిగత చొరవ తో ఏర్పాటౌతున్న బెటాలియన్ ఇది.

### చివరి దశకు చేరిన సాక్షరత

నెల్లూరు జిల్లాలో నిరక్షరాస్యతా నిర్మూలనా కార్యక్రమం చివరి దశకు చేరింది. ఈ సాక్షరతా పథకం కలెక్టరు కె.రాజు స్వంతకార్యక్రమం దాదాపు రెండు సంవత్సరాల నుంచి ఈ పథకాన్ని ఆచరణాత్మకము, సఫలము చేయడానికి ఆయన ఎంత శ్రమ తీసుకున్నాడో, ఎన్ని రాత్రులు నగన్ని నిద్రాహారాలు మాని పనిచేశాడో లెక్కలేదు. తడనుంచి ఉదయగిరి వరకు ఎన్నిగ్రామాలు, ఎన్నేసి పర్యాయాలు పర్యటించాడో, ఎన్ని లక్షలమందిలో సాక్షరతా ఉద్యమం ఆవశ్యకత పట్ల అవగాహన కల్గించాడో ఊహించలేము. దాదాపు 70,80 వేల మంది కార్యకర్తలతో " అక్షర సైన్యం తయారు చేశారాయన. రాజీవ్ హత్య, కరెంట్‌కోత, ఎన్నికలు ,వివిఐపిల పర్యటనలు వంటి అవాంతరాలెన్ని వచ్చినా, పలురకాల సమస్యలు ఎదురైనా తాను ఓర్పు కోల్పోకపోవడమే గాక - ఉద్యమంలోని కార్యకర్తలలో సైతం నిరాశ నిస్పృహలు ఆవరించకుండా చైతన్య స్ఫూర్తి రగిలించాడు.

ఒక సాధారణ అధికారి, ఇన్నివేలమంది లో ఒక సామాజిక ప్రయోజనం పట్ల ఆసక్తిని, ఉత్సాహాన్ని, అంకిత భావాన్ని రేకెత్తించ గలగడం నిజంగా అద్భుత పరిణామం. విషయం మరొక మూడు నాలుగు వారాలలో ఈ ఉద్యమానికి తెరపడుతుంది. నిర్దేశించుకున్న లక్ష్యాలు, సాధించిన విజయాల లెక్క ప్రకారం ఎందరు నిరక్షరాస్యులు అక్షరాస్యులౌతారో తెలియదుకాని, ఈ ఉద్యమం ఫలితంగా పల్లె బాట్లలో చదువు పట్ల ఊహించనంతటి చైతన్యం కల్పిస్తున్నది. నవంబర్ 1 తేదీలోగా చదువు కున్నవారి సంఖ్య ఎంత పెరిగింది, అన్న దృష్టితో కాక, చదువు ఆవశ్యకత ఎంత మందికి అర్థమైంది, అన్న కోణంనుంచి పరిశీలిస్తే ఈ ఉద్యమం నూటికి నూరుపాళ్ళు విజయవంతమైనట్లే లెక్క.

### వేణుగోపాల స్వామికి అరకోటి ఆదాయం!

నెల్లూరు వేణుగోపాలస్వామి దేవాలయానికి చెందిన ఆరెకరాల మాగాణిని వేలం వేడితే 56 లక్షల రూపాయలకు అమ్ముడు పోయింది. ఎసినగర్ ఆనం, ఇళ్ల స్థలాలకు అనుకూలంగా వుండిన పొలంఇది. 10 తేది వేలం జరిపారు. రెండు బిట్లుగా వేలం జరిగింది.

ఈ అరకోటికి ఇంక అంతమొత్తం కలిపి స్వామివారిపేర అత్యాధునిక కళ్యాణ మండపం కట్టించాలని ఆనం వివేకానందరెడ్డి ప్రయత్నం .

జిల్లాలో వున్న అసంఖ్యాక దేవాలయాలలో ఆస్తులు అన్యా క్రాంతం కాకుండా, నిడులు కైంకర్యం జరగకుండా దేముడిపేర సత్కార్యాలు జరుపుతున్న దేవాలయం వేణుగోపాలస్వామి ఆలయం మాత్రమే. జొన్నవాడ కామాక్షితాయికి, నెల్లూరు రంగనాదుడికి కోట్ల విలువ చేసే ఆస్తులున్నాయి. కాని ఆవేవి ఇటు ఆ దేముళ్లకు, అటు ప్రజలకు కూడా ఉపయోగపడడం లేదు. వారి పేరుతో ఒక్క సంస్థానైనా లేదు. కామాక్షి తాయి కొంతనయం. భక్తుల ఆదరణ పల్ల ఆ దేవత వైభవానికి ఏ లోటూ రావడం లేదు రంగనాదుడు మాత్రం నైవేద్యానికి కూడా ముఖం వాచిపోయే పేదవాడైపోతున్నాడు.

### రాపూరులో ఏడుగురు ప్రొబేషన్ అధికారులు

ఐ ఎ ఎస్, ఐ పి ఎస్ వంటి ఉన్నత విద్యాకోర్సులలో ఉత్తీర్ణులైన ఏడుగురు ప్రొబేషన్ అధికారులను ప్రభుత్వం రాపూరుకు పంపింది. గ్రామీణ వాతావరణం ఆర్థిక, సామాజిక, పరిస్థితులు, ప్రభుత్వ పథకాల అమలుతీరు అధ్యయనంచేయడం వీరి కార్యక్రమం. హైదరాబాద్‌లోని సర్దార్ వల్లభాయ్ పటేల్ నేషనల్ పోలీసు అకాడమీ ఈ అధ్యయన కార్యక్రమం నిర్వహిస్తున్నది. తెగచర్ల, క్యానాయపాళెం, కండ్లేరు రిజర్వాయర్ గ్రామాలలో వీరు పర్యటించారు.

బి ఎ,బికాం చదివే మామూలు విద్యార్థులకు కూడా ఇటువంటి గ్రామాల అధ్యయన కార్యక్రమం నిర్వహించడం మంచిది కాదా ?

### మరణాలు

డిప్యూటీ కలెక్టరుగా రిటైరై విశ్రాంతి జీవితాన్ని గడుపుతుండిన శ్రీ పి.హెచ్. రమణయ్య ( 63) 8 తేది గుండెపోటుతో హఠాత్తుగా మరణించాడు. భార్య చనిపోయింది: పిల్లలులేరు. ఎన్ కార్పొరేటర్ చక్కిరాల కృష్ణమూర్తి ఆయన సోదరుడు.

శ్రీ రమణయ్యసౌమ్యుడు , నిజాయితీ పరుడైన అధికారి. విద్యార్థి దశనుండి ఆర్ ఎస్ ఎస్ అభిమాని. పదిరోజుల క్రితమే కాలేజి తాను రచించిన సావర్కర్ గ్రంథాన్ని కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామ రెడ్డిగారి చేత ఆవిష్కరింపజేసుకున్నాడు. ఇంతలోనే మృత్యువు కబళించింది.

× × ×

మాదరాజు గూడూరు వాసి, ఒకప్పుడు దేదీప్యమానంగా వెలిగిన వ్యక్తి కీ||శే|| రావుబహుదూర్ అత్తి వరపు వెంకట రామరెడ్డి కుమార్తె, చిట్టమూరు రామరెడ్డిగారి భార్య, టవున్ ప్లానింగ్ డైరెక్టరుగా ఇటీవలే రిటైరైన శ్రీ ఎన్ వేణుగోపాలరెడ్డి అత్త శ్రీమతి సుకుంతలమ్మ దివంగతురాలైంది. ఆమెకు ఇద్దరు కుమారులు,ఒక కుమార్తె.

× × ×

వి.ఆర్. హైస్కూలు ఇంగ్లీషు అధ్యాపకుడుగా ప్రసిద్ధుడు, ఇంగ్లీషు వ్యాకరణాన్నిగూడా వ్రాసిన గ్రంథకర్త టి. విఠల్ రావు కుమారుడు,అదే స్కూలు లో సైన్సుటీచరుగా పనిచేసి రిటైరైన టి.ఎస్. సత్యనారాయణ ( 62 ) గుండెపోటుతో ఆస్పత్రికి చేరేముందే మరణించాడు. ఆయనకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు.

× × ×

సూళ్లూరు పేట తాలూకా వాసి ప్రస్తుతం నెల్లూరులో వుంటున్న, ఇద్దరు నియమాన్ని పాటించే కాంగ్రెస్ వాది,శ్రీ బేగ కోదండ రామరెడ్డి ధర్మపత్ని కాంతమ్మ ( 64 ) అస్వస్థురాలుగా వుండి 3 తేది చనిపోయింది. ఆమెకు ముగ్గురు కుమారులు, కుమార్తె వున్నారు.

× × ×

ఉదయగిరి తాలూకా మంచులూరు వాసి, ఆ పంచాయతీ అధ్యక్షుడుగా మూడు దశాబ్దాలువుండిన ప్రజాభిమాని, ఆదినుండి ఆగ్రామాన్ని కాంగ్రెసుకు కంచుకోట అనిపించిన కాంగ్రెసు వాది శ్రీ వేమన వెంచయ్య (75) 4 తేది కాలధర్మం చెందాడు. ఆయనకు భార్య, ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు వున్నారు.

పై కుటుంబాలవారందరికీ మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

### నీటిమట్టం

| | |
|---|---|
| సోమశిల | 25.8 టి.యం.సి |
| కనిగిరి | 18.3 ,, |
| నెల్లూరు | 13.7 ,, |
| సర్వేపల్లి | 4.5 ,, |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | 9672 | 3,000.00 |
| మొలగొలుకు | 9674 | 3,000.00 |
| ఐ ఆర్ | 64 | 2,300.00 |
| ఐ ఆర్ | 20 | 2,700.00 |
| సన్నాలు | | 2,500.00 |
| బియ్యం 70 కే | | 420.00 |
| బంగారు సవర | | 3,320.00 |

## అరెస్ట్

(6వ పేజీ తరువాయి)

ఎవరున్నారయింతారో తెలియదుకాని, శివరావన్నపై దాడిజరిపిన స్థాయిలో నెల్లూరక్కడికి ! అత్యంత రహస్యంగా జరిగిపోవలసిన ఈ అరెస్టును ముందుగానే విజయకుమారరెడ్డికి తెలిపేట్లు వ్యవహరించారు. పోలీసుల రాకకు ముందే అతడన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు. పత్రికా విలేఖరులూ వచ్చారు. ఫోటోలు తీశారు. అనుచరులను సమీకరించి, పోలీసువ్యాన్‌లకు అడ్డం పడుండబెట్టారు. ఆ వ్యాన్ నుంచే విజయకుమార రెడ్డి విలేఖరులతో మాట్లాడాడు. అరెస్టు చేసిన గంటల వ్యవధిలోనే కోర్టులో హాజరుపరచి, బెయిల్ ఇప్పించి, సగౌరవంగా ఇంటికి సాగనంపారు.

ఇంకొక ప్రక్క విజయకుమారరెడ్డి అనుచరుల విధ్వంసకాండకు తలవడుతుంటే అందుకు కూడా పోలీసులు సమనంగా సహకరించారు. విజయకుమారరెడ్డి అరెస్ట్‌జరిగింది, పదిగంటల ప్రాంతంలో! పదకొండు గంటలకు విజయమహల్ గేటుదగ్గర ఒక ఆర్‌టిసి బస్‌నుతగులబెట్టారు. పోలీసులు వచ్చి తరిమివేశారు. ఆ గుంపు ఆ తర్వాత పన్నెండు గంటలప్పుడు గాంధీబొమ్మ దగ్గర ఇంకొక బస్ అద్దాలు పగులగొట్టింది. పోలీసులు వారిని మళ్లీ తరిమారు. వారక్కడి నుంచి పరుగెత్తుకుంటూ వెళ్లి సాగలోటలో మరొక బస్ను నిలిపి, నిప్పంటించారు. పట్టపగలు పదిమంది కూడాలేని గుంపును రెండు గంటలపాటు విచ్చలవిడిగా పదిలేయడం పోలీసుల అలసత్వమనుకోవాలా ? లేక కావాలనే అలుసిచ్చారని భావించాలా ? విజయమహల్ గేటు దగ్గరే వారిని తరమకుండా పట్టుకొని స్టేషన్‌లో పెట్టి వుంటే ఇంత అరాచకం జరిగి వుండేదా ? పది మంది వున్న గుంపును అదుపు చేసే చేవ పోలీసులకు లేదా?

కొందరు చెప్పడం, స్థానిక పోలీసు కావాలనే వీరిపట్ల ఉదాసీనంగా వ్యవహరించిందంటారు. కరుకైన వాడిగా పేరుపడిన టౌన్ సర్కిల్‌ఇన్స్‌పెక్టర్‌తో సహా కొందరు స్థానిక పోలీసులు విజయకుమార్ రెడ్డితో స్నేహం నెరపుతున్నారట. సాయంత్రం సరదాలు తీర్చుకుంటున్నారట. వారి మద్దతే విజయకుమార రెడ్డికి ఈ సంఘటనను రాజకీయనాటకంగా మార్చడానికి పనికి వచ్చినట్లుంది.

విజయకుమార రెడ్డికిప్పుడు రెండందాలా లాభమే, ఈ అరెస్టు కింత ప్రచారం జరగడం వల్ల కేసు పెట్టడంలో పోలీసులు విఫలం కావడం వల్ల, నాయకులలోకి కేసు వీకకునుంచి తప్పించుకున్నాడు. ఇంకొక ప్రక్క ఇదంతా ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి తమపై కక్షకట్టి, జరిపిస్తున్న అత్యాచారం అని ప్రజల్లో ప్రచారం చేయగల్గుతున్నాడు. ఈ పేపర్ కటింగులతో ఢిల్లీకి కూడా వెళ్లాలనే ఆలోచనలో వున్నట్లున్నాడతను.

విజయకుమార రెడ్డి ఆరోపణ, ఆగం తప్ప ఇందులో నిజంగా ముఖ్యమంత్రికి ప్రమేయం వుంటుందని, వుండని భావించ లేము. అదే వుండి వుంటే, ఆయన ముఖ్యమంత్రి అయిన తొలిరోజే అరెస్టు జరిగివుండాలి. ఢిల్లీ రాజకీయ మంతనాలు, మతలబులు చేయడం తప్ప, స్థానిక రాజకీయాలలో పోరాడే తత్వం ఆయనకెప్పుడూ లేదు !

ముఖ్యమంత్రిని పబ్లిక్‌గా, పచ్చిగా, తిడుతుంటే ఊరుకుని ఏమి చేస్తున్నది ? వివరణ ఇవ్వడానికే అంత భయపడే వారికి పదవులెందుకు?


### బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వస్తువులు:-

ఆర్. పూనారాం, పాన్ బ్రోకర్ పిబిఎల్ నం 139, 4/1062, నెహ్రూనగర్, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 11.10.1989 నుండి 21.8.1990 తేది వరకు గల విడిపించని వస్తువులు 4.11.91 తేది ఉదయం 10.00 నుండి 4/1062, నెహ్రూనగర్, తిరుపతిలో బహిరంగముగా వేలం జరుపబడును.

కె వి రామకృష్ణారావు,
ప్రభుత్వం నియమించిన వేలందారు
11.268, సంతపేట,
నెల్లూరు.

### ఇల్లు అమ్మబడును

1 - 90, హాస్టల్ రోడ్డు, చిన్నపడుగుపాడు
కోవూరు - నందు 22 అంకణాల స్థలం, అందులోని 6అంకణాల ఇల్లు అమ్మబడును.

వివరములకు
**Dr. S. సత్యనారాయణమూర్తి**
**డయాబిటిస్ క్లినిక్**
**16/1026 – సాగలోట,**
**నెల్లూరు.**
**ఫోన్ నం: 26892,28579**

### గూడూరు డిస్ట్రిక్టు మునసబువారి కోర్టులో

O.P.No : 2/91

నీలం శ్యామల
నీలం చైతన్య -------- పిటిషనర్లు
నిల్ ఎదిరి-------- రెస్పాండెంట్లు

పై చెంబరు పిటిషనును పిటిషనర్ల చనిపోయిన నీలం శ్యామ్యూల్‌కు వారసులు గా ప్రకటించమని Succession Certificate కై పైకోర్టులో దాఖలు చేసినందున ఎవరికైనా ఆక్షేపణలున్నచో 23.10.1991 తేది 10.30 గంటలకు పై కోర్టులో స్వయముగా కాని ప్లీడరు ద్వారా గాని తెలుపుకోవలసినది. అట్లులేని యెడల నదరువిషయం మీ తరఫోక్షమున తీర్మానించబడునని తెలుసుకోవలసినది.

గూడూరు పిటిషనర్ల న్యాయవాది
M. సర్వయ్య

గుంటూరు I A.M.M కోర్టులో

O.S 812/86, EP 634/90

మస్తాన్ ఫుల్లారావు - D.H.R

వరు

సాంబ శెట్టి మల్లేశ్వర రావు - J.D.R

యీ నెంబరు J.D.Rతాలూకు యీ క్రింది ... దాఖలా స్థిరాస్తిని 25.10.91 తేదిన బహిరంగముగా వేలం వేయబడును

షెడ్యూలు

గుంటూరు సబ్ డి I నల్లపాడు గ్రామంలో వి J.D.R తాలూకు వయిలు జప్తు అయి

వేలం కావలసిన స్థిరాస్తి వివరం -

నెం 550 B. యం 2 - 77 సెంట్లు జమ 336 చ.గ లాకీస్తలం ప్లాటు నెం 12. ప్లాటుకు హద్దులు తూ I వాగు హద్దు. ద॥ K.వెంకటరత్నమ్మగారి నెం 13 ప్లాటు. ప॥ రోడ్డు 30 అడుగులు. ఉ॥ N.వెంకటేశ్వర్లు. యీ నాలుగు హద్దులలోని చ.గ 36 ఖాళీ స్థలంకు వరియగు 280- 94 చ.మీ.

D.H.R కిమ్మతురు 5000-00

అమీనా కిమ్మతురు 6048 -00

E.C దాఖలా అన్యా క్రాంతములేవు. వేలం వాయిదా 25.10.91

ఉప్పలూరి గోపాలకృష్ణ శర్మ,

డి I హె I త I అడ్వకేటు:

**In the Court of the Principal District Munsif, Caddapah**

E.P 69/90

OS 225/88

వాసి జయరామయ్య S/oమునెయ్య 60 సం॥ హిందు సాయిపేట, కడప

పిటీషనరు

1. కొట్టేనాగమునీంద్రుడు S/oశేషయ్య హిందు, 32 సం॥ సాయిపేట, కడప

2. యస్.మునిరత్నం, S/o నన్నె చంద్రయ్య 47 సం॥లు వేంపల్లి గ్రామము

3 కదిరి నాగసుబ్బరత్నం, భర్త కె.రామమూర్తి హిందు, 42 సం॥ బెస్తవీధి.

రెస్పాండెంట్లు

రెస్పాండెంట్లు పిటిషనరుకు బాకీ పుండు డిక్రి మొత్తం వసూలు కొరకై షెడ్యూలు దాఖలా ఆస్తిని కోర్టువారు బహిరంగముగా 25-10-91 తేదిన పగలు 10.30 గంటలకు కోర్టు ఆవరణములో యాలం వేయబడును. వదరు వేంములో పాట దారులు పాల్గొన వలెనని తెలియ చేయటమైనది.

షెడ్యూలు

కడప డి - కడప సబ్ డి-

సాయిపేట, డోర్ నెం 9/119 గల పెంకు యింటికి చెక్కు బంది. తూర్పు - పబ్లిక్ రోడ్డు

పడమర - కె. శీలమ్మ బోర కొట్టం

ఉత్తరం - కామిశెట్టి నాగయ్య యిల్లు

దక్షిణం - రస్తా

ఈ చతుర్హద్దుల్లో తూ - ప 32 ఉ - ద 22 అడుగులు గల మిద్దె యిల్లు అడుగు జాగా, తలుపుల ద్వార బంధనములతో సహా

డి.హెచ్.ఆర్. విలువ 5000/-

వి.వెంకటరత్నం

డి.హె. వకీలు

# శివారెడ్డి పద్యాలు

## అక్టోబరు - 2

అమహాత్మగాంధి అవతరించినరోజు
శాంతిదాత గాంధి జన్మదినము
ఇండియాకు మనకు యిది గొప్ప సంక్రాంతి
పర్వదినము, దివ్య పరిమళమ్ము.

ఇండియాకు గొప్ప యిలవేల్పు బాపూజీ,
మరువరాని వ్యక్తి మహనీయుడు,
పుట్టలేడు యింద్య సాటిమేరలోయింక,
అవతరించు గాంధి అంతవాడు.

క్రుంగుచున్న నరికి కూల్పోపి తెల్లోని
సింహాన్ని మనల బందిఖాన
నుండి బయట కీడ్చె పోవాడు, అవాడు
మరువరాని అలోక మధుర పుట్టం

తెచ్చియిచ్చెనీకు దేశ స్వాతంత్ర్యాన్ని
సైకిదెచ్చెనిమ్ము పలుకరాం
భారతీయుడ గొప్ప భాగ్యమ్ము యిదినీకు
విస్మరించు యిలోక వీర గాథ.

ఏమిచేసుకొని, ఏపూజ గావించి
పుట్టినావొ నీవు పుడమిభాయి
... పురుషోత్తముడు గాంధి
... భాగ్యమేమిగలదు !

రాత్రిపూట పథలకు దాలేను యిదేమీద
అస్తమానమైంది అయిపొయ్యింది
టైము మూడు పొద్దు తలకాయ నెరిసింది
దిక్కు తోచడంబ దిగులుగుంది !

## నెల్లూరు ఎక్స్‌ప్రెస్!

నెల్లూరు ఎక్స్‌ప్రెసూ !
వర్లగ వర్ధిల్లు వేయి సంవత్సరముల్
అల్లారు ముద్దుబిడ్డగ
ఎల్ల తెలుగు నాట, నీకు యివే ఆశీస్సుల్

## పద్యాలు గద్యాలు

మునుపుటాల కలము ముందర వెయడంల
పంచిపెట్టడంల ఫల రసాలు
తెలుగు పాఠకులకు, తెలుపండి దయచేసి
కారణమ్ము ? టైము కలసిరాల !
ఇంచుమించు ఏనుబదేళ్ల ప్రాయమువాళ్లే
కొడె ప్రాయపోళ్లే కుర్రవాళ్లే
వరినమూస్తే యింక పద్యాలు గద్యాలు
అస్తమానమైంద అరుగంట !

## జనవాణి

(3పేజీకారవ)

మనవి. అయితే క్రొత్త సినిమాలు వీడియో కాసెట్లుగా రిలీజు చేసేకంపెనీలు ఆకాసెట్లమీద తమరాబోవు చిత్రాల ప్రకటనలయినవ్వంటారు. అట్లా చేయకుంటే బాగుంటుంది. ఎందుకంటే డిష్ యాంటెనా ప్రేక్షకులు అప్రకటనల్ని చూసి ఇవికూడా త్వరలో డిష్‌లో వస్తాయి అని హాలుకు వెళ్ళి చూడడం మానేస్తారు. అసలే కలెక్షన్లు లేని సినిమాలు మరీ చతికిలబడిపోతాయి.

నెల్లూరు. యద్దనపూడి సరోజిని.

### ఈ పశువుల్ని తోలుకపొండి !

ఇందుకూరు పేట మండలం రాముడు పాలెం గ్రామంలో రెండు నెలలనుంచి నాలుగు బర్రెలుపంచాయతీ బందెలదొడ్డిలో వున్నాయి. పశువుల గలవారు రాముడుపాలెం గ్రామానికి వచ్చి సర్పంచ్‌ను కలిసి,వాటిని తోలుకొని పోవలసిందిగా కోరుతున్నాము.

రాముడు పాలెంకె. రామసుబ్బారెడ్డి

### రోడ్లమీద పశువుల మందలు

నెల్లూరు పట్టణ జనాభా విపరీతంగా పెరిగి పోయింది ... తోడు వాహనాల సంఖ్య చెప్ప శక్యం గాదు. ఈ రద్దీలో కాలినడకన పోయేవారు పడే ఇరుకూ ఇబ్బందీ ఇంతంత గాదు.

ఈతిబాధలు చాలవన్నట్టు ట్రంకు రోడ్డు మీద పశువుల మందలు! టౌను హాలు కి సమీపంలో సాయంత్రం పూట జమయ్యే పశువులు ఎంతటి అసౌకర్యాన్ని కలుగ జేస్తూ ఉన్నాయో అనుభవైక వేద్యమే. కానీ యీ పశువుల మందను ఎవరూ పట్టించు కోక పోవడం, మునిసిపాలిటి వారు ప్రేక్షకులుగా ఉండిపోడం మాత్రం శోచనీయం. టౌనుకి ఇది ఒక శాశ్వత శాపమా? ... పచ్చి తిని బ్రతకమని వొదిలేసిన ... పశు మందను ఇకనైనా రోడ్లమీద ... చర్యలు తీసికోవాలని మునిసిపాలిటి అధికారులకు మనవి

నెల్లూరు,సత్యవేట శ్రీకాంత్

### వికలాంగులపట్ల రైల్వే వారి నిర్దయ

... వికలాంగులకు రైలులో ప్రయాణానికి 75 శాతం రాయితీ సౌకర్యం ఉండేది.దానిని రద్దుచేసి పూర్తిగా నడవలేని వారికి మాత్రమే వర్తిస్తూ ఇటీవల జీ.వో. జారీ చేశారు.

పోలియో వ్యాధి వచ్చి కాలు చచ్చుబడి,నడవగలిగే వారు వికలాంగులు కారని నిర్ణయించడం నిర్దయతో కూడిన చర్య. రాష్ట్రప్రభుత్వాలు వికలాంగులకు ఎన్నో సౌకర్యాలు కల్పిస్తున్న యీ తరుణంలో రైల్వేవారు ఇలాటి జీ.వో.ను జారీ చేయడం ఎంతైనా గర్హ నీయం . మన జిల్లాకు చెందిన పార్లమెంటు సభ్యులు వెంటనే జోక్యంచేసికొని రైల్వేవారి నిర్దయాపూర్వకమైన, వికలాంగులకు హానికరమైన పై జీ.వో.ను రద్దుచేయించాలని కోరుతున్నాను.

నెల్లూరు ఆర్. వెంకటరామయ్య

### ఏక గ్రీవంగా పి.వి ఎన్నిక

భారత దేశంలో ఇప్పటి వరకు ప్రధాన మంత్రులంతా ఎం.పి. గా ఎన్నికైన తరువాత ప్రధాన మంత్రులయ్యారు. ప్రస్తుత ప్రధాని పి.వి. నరసింహారావుగారు లోక్ సభకు ఎన్నిక కాకుండానే ప్రధాన మంత్రిగా నియమితులయ్యారు. కనుక ఆరునెలలలో ఎం.పి.గా ఎన్నిక కావాలి

ఇంతటి గౌరవం ఆంధ్రప్రదేశ ప్రజలకు దక్కటం గొప్ప విశేషం. ప్రధాని ఎన్నిక ఏక గ్రీవంగా జరగాలని అందరూ కోరుకుంటున్న ఈ సమయంలో వామ పక్షపార్టీలు పి.వి. నరసింహారావు గారికి పోటీ పెట్టాలని నిర్ణయించడం బాధాకరంగా ఉన్నది. వామపక్షపార్టీలు తమవైఖరిని మార్చు కొని పి.వి గారి ఏక గ్రీవ ఎన్నికకు తోడ్పడి ప్రపంచంలో ఆంధ్రప్రదేశ్ ప్రజల గౌరవాన్ని ఇనుమడింపజేయ వలసిందిగా వామపక్ష పార్టీలకు మనవి చేస్తున్నాను.

నెల్లూరు జె. పోలిరెడ్డి

## జిల్లావార్తలు

(5పేజీకారవ)

వాచ్ మాన్ లేదు. ఒక చిన్న ఉద్యోగాన్ని భర్తీచేయజాలని స్థితిలో పడటం పాలనా యంత్రాంగపు వైఫల్యాన్ని సూచిస్తున్నది.

### గూడూరు ఎన్జీఒ నిలయంలో జూదం

ఆదిపేరుకు యన్.జి.వో నిలయం. అక్కడ జరుగుతున్నది నిరంతర చతుర్ముఖ పారాయణం. మధ్యతరగతి ఉద్యోగులకు మద్యం తరువాత వ్యసనం పేకాటే. ప్రభుత్వ ఉద్యోగులు; అందులో రాష్ట్ర ప్రభుత్వ "తెల్ల కాలర్ " కేడర్ ఈ జూదానికి తమ జీవితాలను అంకితం చేయడం వల్ల ప్రజా జీవనం కలుషితం అవుతుంది. తమ కుటుంబాలను నాశనం చేసికోవడమేగాక, డబ్బుకోసం లంచాలు గుంజడం ఎక్కువ చేస్తారు.

గూడూరు పట్టణంలో డివిజన్ స్థాయి పోలీసు అధికారులుండీ యీ పేకాట విచ్చల విడిగా, అడ్డూ అపూ లేకుండా సాగటం గమనించి ... మనిషిల కోక ... పెరవా ఉద్యోగులకోక ... అని ప్రశ్నించుకోరా?

### ఏడిఓ ల సభ

రాష్ట్రగ్రామాభివృద్ధి అధికారుల సంఘం నెల్లూరు జిల్లా శాఖ సమావేశం ... నెల్లూరు రూరల్ మండల ప్రజాపరిషత్ భవనంలో జరిగింది. సభకు ... అధ్యక్షులు శ్రీ జయ దేవదానం అధ్యక్షత వహించారు. ఏడిఓ ల జీతభత్యాలు, వ్యవసాయ తదితర శాఖల కన్నా అధ్వాన్నంగా వున్నాయని, పూర్వం ఈ డివిజన్ లో ఏడిఓలకు అన్యాయం జరిగిందని రాష్ట్ర ముఖ్యమంత్రి ఈ విషయంలో కల్పించుకొని తగిన చర్యలు తీసుకోవాలని శ్రీ దేవదానం కోరారు. కార్యదర్శులు శ్రీ సింగ్ శ్రీ సంజీవరావు ప్రభృతులు మాట్లాడారు.

జిల్లా లోని వివిధమండలాల కు చెందిన ఏడిఓలు, జిల్లా నాయకులు ఈ సభలో పాల్గొన్నారు.

## పంచాంగం

పండుగలు

తేది 14 సోమవారము సరస్వతీ పూజ
తేది 15 మంగళవారము దుర్గాష్టమి
తేది 16 బుధవారము మహానవమి కాళరాత్రి పూజ
తేది 17 గురువారము విజయదశమి

అక్టోబరు నెల తిథులు

ఆశ్వయుజ శుద్ధ

తేది 12 శని పంచమి రాత్రి గంట 4.45వరకు
తేది 13 ఆది షష్ఠి పూర్తిగ
తేది 14 సోమ షష్ఠి పూర్తిగ
తేది 15 మంగళ సప్తమి ఉదయము గంట 8.30 వరకు
తేది 16 బుధ అష్టమి ఉదయము10.05 ..
తేది 17 గురు నవమి పగలు 12.10 వరకు
తేది 18 శుక్ర దశమి పగలు 2గం॥ వరకు

స్వయంపాకుల శ్రీనివాసులు ఎమ్.ఎ


ఫోన్స్:25420(R)25430

విమల్ జంక్షన్

జెంట్స్ రెడిమేడ్ షోరూం

సూటింగ్స్&షర్టింగ్స్

AIR CONDITIONED

కాపువీధి - నెల్లూరు

.1992 తెలుగు క్యాలెండర్లు

1992 తిథుల క్యాలెండర్లు

ఆఫ్‌సెట్ ప్రింటింగులో టైప్‌సెట్టింగ్‌తో

అందముగా ముద్రించి రెడీగా వున్నవి.

కావలసినవారు సంప్రదించండి

శివరామ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్

4/95, విజయగోపాలపురం

నెల్లూరు – 524 002. ఫోన్స్: 25929, 23529

# బాడుగిళ్ళ బాధకు రామోజీ పరిష్కారం!



" అర్చన ఐ.ఏ.ఎస్." లో శ్రీవిద్య, సితార

# తెలుగు నిర్మాతలకు జయలలిత ఎర!

జయలలిత అనుకున్న పన్నీ సాధిస్తోంది. సమాచార సినిమా శాఖను తన వద్దే ఉంచుకున్న ఈ మాజీ తార మనదేశంలోనే తొలి ఫిలిమ్ టెక్నాలజీ యూనివర్శిటీని మద్రాసులో నెలకొల్పబోతోంది. అడయార్‌లోని ఫిలిమ్ అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్‌ను ఇంకా బాగా అభివృద్ధిపరచి, దాని చుట్టూ ఫిలిమ్ సిటీని రూపొందించడానికి ఒక నిపుణుల కమిటీని నియమించింది. 70 లక్షల రూపాయలలో చలన చిత్ర

## మద్రాసులో ఫిలింనగర్– సబ్సిడీలు!

నిర్మాణానికి అవసరమయ్యే సదుపాయాలన్నీ ఇక్కడ ఉంటాయి. 45 లో బడ్జెట్ చిత్రాలకు ఒక్కొక్క దానికి 2 లక్షల చొప్పున సబ్సిడీ ఇవ్వడానికి తమిళనాడు ప్రభుత్వం నిర్ణయించింది. ఇటువైన కొందరు తెలుగు నిర్మాతలు మద్రాసులోనే చిత్రనిర్మాణం సాగించినా మనం ఆశ్చర్యపోనక్కర్లేదు.

## ఆశయాలన్నీ ఆచరణీయాలా ?

పరుచూరి [illegible] ఇటువైన రచనల్లో తమసంభాషణ [illegible]రట. ఇది పరకటిలాగా దర్శక నిర్మాతల ఒత్తిడులకు తల ఒగ్గే రచనలు [illegible]చరట. హింస, ఫైట్లు వంటి నెగెటివ్ ఎలిమెంట్స్ తక్కువగా ఉన్న కథలనే అందిస్తారట. ఇలా చెప్పడం బాగానే [illegible]. ఎంత వరకు నెగ్గుకు రాగలరో [illegible] కాలప్రవాహాన్ని తట్టుకు [illegible]సాధ్యమా ?

## సినీ దిన పత్రికలు

దిన పత్రికల [illegible] సినిమా ప్రకటనల పోటీని ఎదుర్కొ[illegible]నికి " ఈ నాడు " పత్రిక ప్రతిదినం రంగుల్లో సినిమా అనుబంధాన్ని వెలువరించబోతోందని తెలియగానే " ఆంధ్రజ్యోతి " లాంటి దినపత్రికలు కూడా సినిమా వార్తలకు ఎక్కువ స్థానం కేటాయిస్తూ ప్రచురించసాగాయి. ముందుగా పూర్తిసొమ్ము చెల్లిస్తే గాని ప్రకటనలు స్వీకరించని ఒక పత్రిక ఒక నెల క్రెడిట్ ఇస్తామంటూ ముందుకొచ్చింది. ఇలాంటి పోటీల వల్ల నిర్మాతలకు తప్ప పత్రికల వాటికి

- కొరవ 12 పేజీలో

షూటింగ్‌ల కోసం హైదరాబాద్‌లో భవనాలు అద్దెకు ఇచ్చేవారు అదనుచూసి అద్దె రేట్లను విపరీతంగా పెంచేశారు. ఈ అన్యాయాన్ని భరించలేక ఉషాకిరణ్ మూవీస్ వారు హైదరాబాద్ బంజారా హిల్స్‌లోని ఒక విశాలమైన భవంతిని మినీ స్టూడియోగా మార్చేశారు. ఇక్కడ ఇతర నిర్మాతలు కూడా షూటింగ్ జరుపుకోవచ్చు. అద్దె చాలా తక్కువ కూడా!

రామోజీ రావు నిర్మించే తాజా చిత్రం " తేజ " థ్రిల్ సెంటిమెంట్ ప్రధాన ఇతివృత్తం ఈ చిత్రం ద్వారా కె. రాఘవేంద్రరావు, ఎ. కోదండరామిరెడ్డి ప్రభృతుల వద్ద సహాయకుడిగా పని చేసిన ఎన్. హరిబాబును డైరెక్టర్ గా పరిచయం చేస్తున్నారు.

## జయచిత్రకు కలిగిన దిగ్భ్రాంతి

జయచిత్ర . కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, " పుదియరాగం " అనే తమిళ చిత్రాన్ని స్వీయ దర్శకత్వంలో నిర్మించింది. నాయిక కూడా ఆమే. కాని, విడుదలైన ఆ చిత్రాన్ని ప్రేక్షకులు అంతగా ఆదరించలేదు. ఆ బాధలో ఉన్న జయచిత్ర ఒక రోజు కోడంబాకం ఓవర్ బ్రిడ్జ్ మీద తనే స్వయంగా కారు డ్రయివ్ చేసుకు వెళ్తూంటే, ఒక చోట " పుదియ రాగం " చిత్రం పోస్టర్‌ను ఒకడు చించడం చూసింది. అంతే! ఆమెకు కోపం ఆగింది కాదు. వెంటనే కారుఆపి ఆమనిషి దగ్గరికి వెళ్ళింది. " నువ్వేమైనా మనిషివా గాడిదవా ? నాచిత్రం పోస్టరును చించడానికి నీకెన్ని గుండెలుండాలి. ". అంటూ అతన్ని కొట్టడానికి చెయ్యెత్తింది కూడా కాని, ఆమనిషి సమయోచిత ప్రశ్నతో " అదేమిటండీ, అంతగా కోప్పడతారు ? నేను మీ అభిమానిని. ఈ పోస్టర్‌లోని మీ బొమ్మను చించి నా గదికి తీసుకెళ్లి ఆరాధి[illegible]నుకున్నా. " అన్నాడట. దాంతో ఖంగుతిన్నది జయచిత్ర ;కించిత్తు పశ్చాత్తాపం చెందింది కూడా. " ఈ పోస్టర్‌కన్నా ఇంకా బావున్నవి నాలుగైదు ఉన్నాయి. మా ఇంట్లో రా, నీకిస్తా. " అంటూ అతగాడ్ని కారులో తన ఇంటికి తీసుకెళ్లి, కూల్ డ్రింక్ ఇచ్చి, కొన్ని పోస్టర్లు ఇచ్చిందట ! ఉదయం లేవగానే ఎవరి ముఖం చూశాడో అని అతగాడు చకితుడై ఉండాలి.

## మద్రాసు సినిమా వార్తలు

## ఎం. ఎస్. రెడ్డి చిత్రానికి జంధ్యాల దర్శకత్వం

అక్టోబర్‌లో గాని, నవంబర్‌లో గాని చిత్రీకరణ ప్రారంభమయ్యే కౌముది పిక్చర్స్ చిత్రానికి రచయిత జంధ్యాల దర్శకుడు. మల్లెమాల సుందరరామిరెడ్డి నిర్మాత.

## భార్గవ్ ఆర్ట్స్ చిత్రం డిసెంబర్‌లో

బాలకృష్ణ సరసన ఇద్దరు నాయికలుండే భార్గవ్ ఆర్ట్స్ చిత్రానికి డిసెంబర్‌లో ప్రారంభోత్సవం జరుగుతుందని నిర్మాత ఎస్. గోపాలరెడ్డి తెలిపారు. ఈ లోగా అన్ని తరగతుల ప్రేక్షకులను అలరించే పకడ్బందీ అయిన స్క్రిప్టును సిద్ధం చేస్తున్నారు. రచన: గణేశ్ పాత్రో. దర్శకత్వం:కోడి రామకృష్ణ

## మరో పోలీస్ ఆఫీసర్ కథ

పోలీస్ ఆఫీసర్ల జీవితాలలోని సంఘటనలతో ఇంకా ఎన్ని చిత్రాలు తయారవుతాయో ఊహించడం కష్టం. పోలీస్ ఆఫీసర్ మోనిషా వర్మ సంచలన సంఘటనలతో శ్రీ లక్ష్మి కంబైన్స్ నిర్మించే

- కొరవ 13 పేజీలో


## అభినందనలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విప్‌గా నియమింపబడిన

### శ్రీ సి.వి. శేషారెడ్డి ఎం.ఎల్.ఏ గారిని

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ అండర్‌టేకింగ్స్ కమిటీ ఛైర్మన్ గా నియమింపబడిన

### శ్రీ జె.కె. రెడ్డి ఎం.ఎల్.ఏ గారిని

హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

పి.వి. రమణారెడ్డి

కన్వీనర్ – లీగల్ సెల్

నెల్లూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ.


## ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, నెల్లూరుజిల్లా బ్రాంచి

: ప్రకటన :

ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటి నెల్లూరుజిల్లా విభాగ విషయములో ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో యున్న వ్యవహారము పరిష్కరింపబడినందున సదరుసొసైటీ కార్యకలాపములు పునరుద్ధరించవలసి యున్నది. అందువలన నూతన కార్యవర్గమును ఏర్పాటు చేయుటకు ముందుగా సభ్యుల జాబితాను ఖరారు చేయవలసియున్నది. సభ్యులుగా చేరదలచుకున్నవారు అర్జీ తోటి, ఈ క్రింది విధముగా రుసుము శ్రీ టి. దొరస్వామి,పర్సన్ ఇన్‌ఛార్జి, 27/363, గాయత్రినగర్, నెల్లూరు- 4 లేక ఇండియన్ రెడ్‌క్రాస్ ఆఫీసులో ( మద్రాసు బస్టాండువద్ద ) వారికి చెల్లించి 15.12.1991 లోగా సభ్యులుగా చేరవలెను.

| | | |
|---|---|---|
| 1. | జీవిత సభ్యత్వము | రూ. 250 /- లు |
| 2. | వార్షిక సభ్యత్వము ( నూతన సభ్యులు ) | రూ. 12 /- లు |
| 3. | వార్షిక సభ్యత్వము ( రెన్యువల్ ) | రూ. 12 /-లు |

ఇదివరకు జీవిత సభ్యులుగా యున్నవారు తమ సభ్యత్వ [illegible], ప్రస్తుత విలాసమును 15 . 12 . 1991 తేది లోగా తెలుపవలయునని కోరడమైనది.

కె.రాజు

జిల్లా కలెక్టరు మరియు ప్రెసిడెంటు
నెల్లూరు జిల్లా ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటి , నెల్లూరు.

## కువ్వం డి. ము. కోర్టులో

OEP 46/87

OS 203/77

V.M.లక్ష్మయ్య శెట్టి - వాది

మరియు

కొలమ్మ - - ప్రతివాది

### వేలం నోటీసు

యీ దిగువ షెడ్యూలు దాఖలా ప్రతివాదియొక్క స్థిరాస్తును పై కోర్టువారి వలన 21.10.91 వ తేది ఉదయం 10.30 గం|| ల గాయుతు వేలం వేయబడును. వేలంలో పాల్గొను వారు పాల్గొన వచ్చును.

### షెడ్యూలు

చిత్తూరు జిల్లా - కువ్వం ఎస్.డి | - కువ్వం తాలూకా నెం. 80, యామునూరి పల్లె గ్రామం మజరా - పాపిమూరు గ్రామం వద్ద | -

1. సర్వేనెంబరు - 154/3 - పుంజ - ఎ. 1.67 సెంట్లు - హె 0.676 బాపి. టెంకాయ మాన్లు తో సహా -

2. సర్వే నెంబరు - 138/7 - పుంజ - ఎ. 1.29 సెంట్లు హె 0.522 పంవృక్షములు మరియు ఆకు చెట్లు తో సహా - తాకట్టులు ఏమియున్న లేవు.

కె.యస్ నారాయణ శెట్టి

డిక్రీ హోల్డరు అడ్వకేటు.

కువ్వం – 517425.

## నెల్లూరు అఫిషియల్ రిశీవరు కోర్టులో

కావలి సబ్ కోర్టు ఐ.పి. నెం. 2/91

కొమ్మనేని కొండప నాయుడు S/o రామానాయుడు, శిద్దన కొండూరు కలిగిరి మండలం. నెల్లూరు జిల్లా - పిటిషనరు / డెట్టా

పై నెంబరు ఐ.పి లోని ఇన్ సాల్వెంటు తాలూకు కలిగిరి మండలం లక్ష్మీపురం కంద్రిగ మజరాకందుల వారి పాళెం గ్రామంలోని భూములను 1401 ససలీకి కౌలుకు 21.10.91 తేదిన పగలు 2 గంటలకు నెల్లూరు లో యీ ఆఫీసులో నా వల్ల బహిరంగముగా యాలం వేయబడును. పాట దారులు షరత్తు లు, షష్టి హారు వగయిరాలు యీ ఆఫీసులో తెలుసుకొన వచ్చును.

ఎం.కె. సింగరాజు

అఫిషియల్ రిసీవర్

నెల్లూరు

## నెల్లూరు అఫిషియల్ రిశీవరు కోర్టులో

గూడూరు సబ్‌కోర్టు ఐ.పి. 1/91

గుండ్ల పల్లి చినమస్తానయ్య S/o క్రిష్ణయ్య, కలువాయి గ్రామం, నెల్లూరు జిల్లా - పిటిషనరు / డెట్టా.

పై నంబరు ఐ.పి. లోని ఇన్ సాల్వెంటు తాలూకు కలువాయి గ్రామంలోని మస్తానయ్య ఆయిల్ మిల్లును ఒక సంవత్సరము లీజుకు యాలం తేదినుండి సదరు కలువాయి గ్రామంలో ఆయిల్ మిల్లు వద్ద 26.10.1991 తేదిన పగలు 11 గంటలకు బహిరంగముగా యాలము వేయబడును. పాట దారులు షరత్తులు, షష్టి హారు వగయిరాలు యీ ఆఫీసులో తెలుసుకొనవచ్చును.

ఎం.కె. సింగరాజు

అఫిషియల్ రిసీవర్

నెల్లూరు

## పులివెందల

(మొదటిపేజి కొరవ)

జనార్దనరెడ్డి ఈ వారం మొదట్లో ఢిల్లీకి వెళ్లి వచ్చిన తర్వాత చాలా సంతోషంగా కన్పడుతున్నాడు. అంటే, ఆయన దృష్టిలో రాజశేఖర రెడ్డి కి పులివెందుల సీటు రావట్లే లెక్క. ఈ ఇద్దరు నాయకుల ప్రాణం సివితేతిలో వుంది. ఆయనేవిఅంకవిరువ్వుతాడో, ఏవింక గొంతువిప్పుకుంటాడో చూడాలి!

### వెంకట స్వామిని రంగంలోకి తెస్తారా ?

కేంద్ర మంత్రి శ్రీ జి. వెంకటస్వామిని రాష్ట్ర రాజకీయాలలో దింపే ప్రయత్నమొకటి ప్రారంభమైంది. రాజకీయ నాయకులతోపాటు, కొందరు సీనియర్ ఐ ఎ ఎస్, ఐ పి ఎస్ అధికారులు సైతం ఈ ప్రయత్నంలో భాగం పంచుకుంటున్నారు. రాష్ట్రంలో హరిజనులపై అత్యాచారాలు పరుసబెట్టి జరుగుతున్న దృష్ట్యా, ఒక హరిజనుడ్ని ముఖ్యమంత్రిగా నియమిస్తే కాంగ్రెస్ పార్టీ పట్ల విశ్వాసం పాదుకొల్పవచ్చునేది వీరి వాదం. దామోదరం సంజీవయ్య తర్వాత వెనుకబడిన తరగతులవారికి కాని, మరే హరిజనులకు కాని అవకాశమే రాలేదని అందువల్ల ఇప్పుడొక హరిజన నాయకుడికి ఆ అవకాశం ఇచ్చితీరాలని వీరు ప్రచారం చేస్తున్నారు.

## సింహపురి

(4 పేజికొరవ)

### అన్నమయ్య సంస్మరణకు సంగీత పోటీలు

అన్నమయ్య సంగీత ప్రచారసభ నెల్లూరు వారి ఆధ్వర్యంలో అన్నమయ్య సంస్మరణోత్సవసందర్భంగా సంగీత పోటీలు టౌను హాలులో ఈ నెం పందొమ్మిది ఇరవయ్యవ తేదులలో నిర్వహించ బడతాయి. నగదు బహుమతుం తో పాటు జ్ఞాపికల బహూకరణ కూడా జరుగుతుంది.

పాటం పోటీకి పదిరూపాయలు, సంగీతం కూర్పు పోటికి 50రూ|లు ప్రవేశ రుసుము చెల్లించాలి. వివరాలకు ప్రసిడెంటు, అన్నమయ్య సంగీత ప్రచారసభ, 26/512, పోస్టల్ కాలని, ఎ.కె. నగర్, నెల్లూరు - 4 కి వ్రాయండి.

### కళారాధన పోటీలు

కళారాధన, నెల్లూరు వారు తమ నాల్గవ వార్షికోత్సవ సందర్భంగా టౌను హాలులో ఈ నెం 20 వ తేదీన సినిమా పాటలు, లలితసంగీతం, జానపదగీతాలు, రికార్డు డ్యాన్సులు, బ్రేక్ డ్యాన్సుల పోటీలు నిర్వహిస్తామంటూ తెలియజేస్తున్నారు.

వివరాలకు ఆర్. యం. తుర్లపాటి. 17/294/7, బారకాస్, ఆచారివీధి, నెల్లూరుకు వ్రాయండి

### శ్రద్ధాంజలి

ప్రముఖ నాట్యాచార్యులు యస్.వి. టోంపే గారు స్వర్గస్థులైన సందర్భంగా ఈ నెల ఆరవతేదీ కళాంజలి సాంస్కృతిక సంస్థ' సంతాప సభ జరిపి శ్రద్ధాంజలి ఘటించింది.

### యువజన కాంగ్రెస్ వనమహోత్సవం

గాంధీ జయంతి నాడు యల్. రామశివారెడ్డి నాయకత్వంలో రెండు వందలమంది కాంగ్రెస్ కార్యకర్తలు కొండాయపాళెం గేట్ దగ్గరుండే బాలుర హాస్టల్ లో వెయ్యిమొక్కలు నాటారు. పై కార్యక్రమాన్ని శ్రీ ఆనంసంజీవరెడ్డి ప్రారంభించారు.

### సురభి వారి నాటకాలు

డిసెంబరు 11 తేదీ నుండి 14 వరకు కస్తూరిబా కళా క్షేత్రంలో వేదం వెంకట రాయ శాస్త్రి నాటకోత్సవాలను రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ, తెలుగు విశ్వవిద్యాలయం సంయుక్తం గా నిర్వహించనున్నాయి. నాలుగు రోజులు జరిగే యీ అఖిలాంధ్ర నాటకోత్సవాలలో సుప్రసిద్ధమైన నాటకాలను ప్రదర్శిస్తారని, ఈ నెం 17, 18 తారీఖులలో సురభి నాటక సమాజం వారిచే, మాయాబజారు, కృష్ణలీలలు ప్రదర్శింప జేయనున్నారని డి.పి.ఆర్. ఓ: తెలియ జేస్తున్నారు. అడుగంటి పోతున్న నాటకరంగానికిమాత్రం చేయూతనైనా ఇస్తున్నందుకు జిల్లా సాంస్కృతిక మండలిని అభినందించాలి!

## సన్నాయి నొక్కులు

4వ పేజి కొరవ

మునిసి పాలిటీలో పలు అవినీతి కథలు, అవకతవకలు వెలికి తీశారు. వాటన్నింటినీ ప్రభుత్వానికి నివేదించారు. మునిసి పాలిటీ రద్దుకు సిఫార్సు చేశారు. కాని, ఆరు నెలలలో ఎటూ దిగిపోయే వాడిని కదలించి, రాజకీయ రచ్చ కొని తెచ్చు కోవడం ఎందుకనో, రమేష్‌రెడ్డిపై అభిమానంతోనో, మరేదో కారణం తోనో ముఖ్యమంత్రి ఈ పైలును బిగపట్టి వుంచాడు. లేకుంటే ఈ పాటికెప్పుడో పదవి ఊడిపోయి వుండేది.

జనార్దన రెడ్డి ముఖ్యమంత్రి కాగానే మునిసి పాలిటికి లక్షల విదులిచ్చారు. మంత్రిగా వున్నప్పుడు ప్రతి సభకు పిల్చి, గౌరవించాడు. పొగిడి, సంతోష పెట్టాడు. ఇవన్నీ రమేష్ రెడ్డి రాజకీయం మేలుకే ఉపయోగ పడ్డా యన్నది వాస్తవం. ఈపరిస్థితిలో మేము చేసిన ప్రస్తావన తప్పెట్ల అవుతుంది?

పార్లమెంట్ ఎన్నికలప్పుడు రమేష్ రెడ్డి నెల్లూరు నుంచి అదృశ్యమై పోవడం, ఎన్టీఆర్ పై వీరాభి మానంతో చేసిన పనేనా? తనపై విచారణను నిలపమని అభ్యర్థించి, అందుకు ప్రతిగా ఎన్నికలలో తెలుగు దేశం పార్టీని దుద్దులో కలిపి పోయింది వాస్తవం కాదా? ఒంగోలు లో కాంగ్రెస్‌కు ప్రచారం చేయ లేక పోయినందుకు సంబంధితుల దగ్గర కళ్ళ నీళ్ళు పెట్టుకొని, క్షమాపణ కోరింది నిజం కాదా? నూటికి నూరుపాళ్ళు ఎన్టీ ఆర్ నే నమ్ముకున్నప్పుడు ఈ కాళ్ళ బేరం కెందుకు దిగినట్లు?
రాజకీయాలలో వుండేవారు పత్రికల విమర్శలు, వ్యాఖ్యల పట్ల దొంగకు తేలు కుట్టినట్లు గమ్మునుండడం వంటికి మంచిది. పాతివ్రత్యం నటిస్తే పాత రంకులు బయట పడతాయి.


నిర్మల

ఇప్పుడు నిర్మల 20 పైసలు పక్కపొడి
అన్ని షాపులలో దొరుకుతుంది అడిగి తీసుకొనండి



## ఆంధ్రప్రదేశ్ మాంసము మరియు కోళ్ళ అభివృద్ధి సంస్థ

శాంతినగర్ – హైదరాబాదు

పై సంస్థ ఆధ్వర్యంలో నెల్లూరు టౌన్‌లో ఈ క్రింద కనుపరచిన స్థలము లందు కోడిగ్రుడ్లు, కోడి మాంసము, పశువుల దాణా, కోళ్ళదాణా సరసమైన ధరలకు అమ్మబడు చున్నవి. అమ్మకపు రేట్లు కొనుగోలు ధరను బట్టి మారు చుండును. వినియోగ దారులు గమనించ ప్రార్థన.

| | | |
|---|---|---|
| 1. | పౌల్ట్రీ మార్కెటింగ్ సెంటర్ (ఎ.కె.నగర్ (ఇండస్ట్రియల్ ఎస్టేటు) | కోడిగ్రుడ్లు, కోడిమాంసము, పొట్టేలు మాంసము పశువుల దాణా, కోళ్ళదాణా, సోయాబీన్ ఎక్స్ ట్రాక్షన్ (నవంబరు నుండి) |
| 2. | స్వాతి రెస్టారెంట్ సమీపం మద్రాసు బస్టాండు దగ్గర | కోడిగ్రుడ్లు, కోడిమాంసము, పొట్టేలు మాంసము (ప్రతి ఆదివారం మాత్రమే) |
| 3. | పశువుల ఆస్పత్రి ఆవరణ రైల్వే ఫీడర్సు రోడ్డు. | కోడిగ్రుడ్లు, కోడిమాంసము పొట్టేలు మాంసము సీమ పంది మాంసము |
| 4. | యద్దల రేవు సంగం ఆంధ్రాబ్యాంక్ సమీపం | కోడిగ్రుడ్లు, కోడిమాంసము, పొట్టేలు మాంసము పశువుల దాణా, కోళ్ళ మేతలు |

**ప్రస్తుతం అమ్మకపు రేటు : కోడిగ్రుడ్లు 0.67 పై**

**కోడి మాంసము రూ 31/– పొట్టేలు మాంసము రూ 47/–**

గమనిక : 1. కోడిగ్రుడ్లను జిల్లాలోని వెంకటగిరి, నాయుడుపేట, సూళ్ళూరుపేట, వాకాడు, ఆత్మకూరులకు, కార్పొరేషన్ వాహనములలో సరఫరా చేయబడును.

2. విందులకు, ఫంక్షన్స్‌కు ఆర్డరుపై సరఫరా చేయబడును.

వివరములకు సంప్రదించండి.

డా|| జి. వేణుగోపాల రెడ్డి

జిల్లా మేనేజరు (ఇన్‌చార్జి)

పౌల్ట్రీ మార్కెటింగ్ సెంటర్, ఫోన్ నెం: 27083

ఇండస్ట్రియల్ ఎస్టేటు - నెల్లూరు - 4.

కళ్ళముందునడిచేరౌడీరాజ్యపురాక్షసత్వాన్నితెరపైచూపిన

# ఆగ్రహం

మన ప్రజాస్వామ్యం నానునాను రౌడీ స్వామ్యంలా రాజ్యంగా మారిపోతూవుంది. విదవుల్లోని స్వార్థబుద్ధులు సాగించే దమనకాండ స్వాతంత్ర్యభారతం పునాదులనే కదిలించి కృంగదీస్తూ వుంది. ప్రజాక్షేమానికి జీవశక్తి అయిన ప్రజా స్వామ్యం ఆగిపోయాల్లో సమాధి అయ్యే రోజు చేరింది. ఈ నగ్న రూపం. ఈ రాక్షస ప్రవర్తన ప్రజా ప్రతినిధులను పాలించగల సుప్రీంకోర్టు న్యాయమూర్తులకు, న్యాయస్థానాలకు, ప్రజా బాహుళ్యానికి అందరికీ తెలుసు. కాని అందరూ గమ్మునా వుండిపోతున్నారు. న్యాయం నిశ్శబ్దం వహించింది. ధర్మం చీకటిలో చిక్కింది. కర్తవ్యం అచేతనమైంది.

ఈ దారుణ పరిస్థితుల్లో ఎవ్వరు పూరుకున్నా యం.యస్. ఆర్ట్సు సంస్థ అధినేతలు యం.యస్. రెడ్డి, శ్యాంప్రసాద్ రెడ్డి మౌనంగా కూర్చోలేరు మనసులో మదనపడ్డారు. ఆ అంతర్మథన ఫలితమే " ఆగ్రహం" చిత్రం.

" ఆగ్రహం " ... ఆవరించివున్న నిశ్శబ్దంలో శబ్దాన్ని ధ్వనింపజేసింది. క్రమ్మిన చీకట్లలో వెలుగును జ్వలింపజేసింది. అచేతనంలో చైతన్యం ప్రజ్వలింప జేసింది. ప్రజల ఆగ్రహానికి ఎదురులేదు. ప్రజలు తలచుకుంటే సాధించలేనిదిలేదు. అందుకే, మాతృదేశసమైక్యత కోసం, జన్మ భూమి సంరక్షణ కోసం, రౌడీ రాజ్యం నిర్మూలనకోసం నడుంబిగించమని ప్రతి భారత పౌరుణ్ణి అభ్యర్థించింది " ఆగ్రహం " చిత్రం.

ఎన్నుకున్న కథాంశం సామాజిక ప్రయోజనంతో ప్రశంసనీయంగావుంది. రాజకీయ పదవుల్లో వున్న స్వార్థపరులు ఈనాడు సాగిస్తున్న రౌడీ రాజకీయచరిత్రను యథాతథంగా, నిర్మొహమాటంగా, నిర్భయంగా ప్రేక్షకుల ముందుంచారు. యం.యస్. ఆర్ట్సు సంస్థ చేసిన మరోసాహసం ఇది. ఎందుచేతనంటే రాష్ట్రముఖ్యమంత్రిని ఒక పెద్ద గూండాగా చూపారు. ఈ ముఖ్యమంత్రి నడవని అవినీతి వ్యాపారంలేదు. హత్యలు, అంజదులు అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. రౌడీలు అతనికి అండదండలు. తనముఖ్యమంత్రిపదవికెక్కు తెదరకుండా వుండేందుకు, ఎలెక్షను సమయంలో తన కరాతుర్ని హత్యచేసి ఆ హత్య


చిత్రసమీక్ష
గ్రిద్దలూరుగోపాలరావు


ప్రతిపక్షాలనెత్తిన రుద్ది ఫ్రీ ఓటర్ల పానుధూళిపొంది ఎలెక్షన్లలో గెలుపొందిన రాక్షసుడు. ఇదీ ఈ ముఖ్యమంత్రిజీవలక్షణం.

ఈ దుష్ట పాత్రకు ఎదురుగా ఒక మంచి కథానాయకుడి పాత్రను ఎన్నుకున్నారు నిర్మాతలు.

అది, విజయ్ అనే సిన్సియర్ మిలిటరీ ఆఫీసర్ పాత్ర ( రాజశేఖర్ ). విదేశీ శత్రులనుంచి దేశాన్ని, దేశప్రజను రక్షించే యుద్ధవీరుడతను. దేశభక్తి అతని మొదటి ప్రాణం. జన్మభూమి రక్షణ అతని ప్రథమ కర్తవ్యం. తనజన్మ భూమిని ఎవరు కించపరచినా , ఏ కొంచంగూడా అతను సహించడు. నీతినియమాలు అతనిలో నిక్షిప్తమై వున్నాయి. అందుకే అతను ఎంతో ఠీవిగ నిర్భయంగా, సగర్వంగా, దుర్గ్యా, కర తలెత్తుకొని తిరుగుతాడు. ఆ మిలిటరీ ఆఫసర్, గుడ్డివాడుగా ఒంటరి జీవితం గడుపుతున్న తన తమ్ముణ్ణి చూచేందుకు మూడు మాసాల సెలవు మీద హైదరాబాద్ వస్తాడు. ముఖ్యమంత్రి రౌడీ విధానంపై, హత్యారాజకీయాలపై, ఆగ్రహం వ్యక్తంచేస్తాడు. జన్మభూమి సంరక్షణ, ప్రజాక్షేమం నరనరాల్లో జీర్ణించుకపోయిన ఆయుద్ధవీరుడు ముఖ్యమంత్రి దేశ ద్రోహంపై యుద్ధం ప్రకటిస్తాడు. తన ప్రియురాలు చిత్ర (అమల) తో వివాహం గూడా వరిగణలోకి తీసుకోడు. ముఖ్యమంత్రి ని నేరస్తుడిగా నిరూపించేందుకు సాక్షిని సేకరిస్తాడు. కాని ఆసాక్షి, సాక్ష్యం చెప్పేసమయంలో చనిపోతాడు. విజయ్‌ను హంతకుడిగా ముఖ్యమంత్రి బంధించబోతాడు. కాని విజయ్ మెషిన్ గన్‌తో ముఖ్యమంత్రిని, అతని రౌడీ ముఠానుహతమారుస్తాడు.

ముఖ్యమంత్రి, విజయ్ పాత్రలను దర్శకుడు కె.యస్. రవి గొప్పగా మలిచాడు. దర్శకత్వంలోని మెళుకు వలలో పట్టుపడలకుండా చిత్రాన్ని పరుగెత్తించాడు. దర్శకుడుగా ప్రధానప్రయత్నం లోనే విజయం సాధించాడు.

విజయ్ రౌడీలను చెంపలు వాయించటం వేళ్ళు పటపట విరిగేట్టు చేతులు మెలిదిప్పటం అక్కడి నే పథ్యశబ్దాలు, కొత్త పంథాలో వున్నాయి. ముఖ్యమంత్రి జరిపిన దమనకాండ, " ఇలాచేస్తున్నారా? "- అన్నంత భయంకరంగావుంది. విజయ్ తనప్రాణాలను ఒడ్డి సాక్షినిసేకరించిన ఘట్టాలు, ముఖ్యమంత్రి బలగం హెలికాప్టర్లలో విజయ్‌ను వెంటాడి వేటాడిన దృశ్యాలు ప్రేక్షకులను బాగా ఆకట్టుకుంటాయి. రాజశేఖర్ అమలంపై " నిను కోరివచ్చారా రాజశేఖరా " - అన్న పాట చిత్రీకరణ సొంపు గావుంది. చలాకీ పాల పిట్టలా అటుఎగిరిఇటుఎగిరి అమల ఉక్కిరిబిక్కిరిచేసి చక్కలిగింతలు పెట్టింది. ఈ పాట దృశ్యంలో చిత్తుగా ఉతకబాదిన వాతంలో నెత్తురు గీతంలో పిచ్చాసు పత్రిగదిలో రాజశేఖర్‌ను బోళ్ళా పడుకోబెట్టి నగ్నంగా చూపిన దృశ్యం హాలీవుడ్ చిత్రాల్లో నగ్నదృశ్యాలను మరిపించింది.

శ్రద్ధా భక్తులు గలమిలిటరీ ఆఫీసర్ ఠీవిని గాంభీర్యాన్ని, గొప్పగా చూపాడు రాజశేఖర్ . చురకత్తి లాంటి రాజశేఖర్ మీసానికి రోషముందని మరోసారిరుజువైంది. ఈ చిత్రంలో, ముఖ్యమంత్రి పాత్రలో కృష్ణారెడ్డి అనుకుంటూ కాస్త వెలితిగా కనిపించాడు. మేలురకం కవిగానే గాక మెరుగైన నటుడని నిరూపించుకున్నాడు. శ్రీఉండేలమాల కొండారెడ్డి జడ్జి పాత్రలో! చిన్నపాత్రల్లో ని మిగతా చిన్న నటీనటులు గూడా చక్కగా నటించారు పరుచూరి బ్రదర్సు మాటలు అక్కడక్కడా గట్టి చురకలు వేస్తాయి. నేపథ్యసంగీతం ... చిత్రం ఊపును పెంచాయి


CROWN-TV
With Technical assistance from NEC Japan
CARRINA
అథరైజ్డ్ డీలర్: నెల్లూరు, ప్రకాశం జిల్లాలకు
స్టీరియో సౌండ్స్ ఇండియన్ బ్యాంక్ ఎదురుగా ట్రంక్‌రోడ్, నెల్లూరు
ఫోన్ 5428



అభినందన మందారమాల

మాకు అత్యంత ఆత్మీయులు, హితులు, శ్రేయోభిలాషి

శ్రీ జె.కె. రెడ్డి గారూ

రాష్ట్ర పబ్లిక్ అండర్ టేకింగ్స్ కమిటీ చైర్మన్‌గా నియమింప బడిన శుభ సందర్భంలో, అందుకోండి మా హృదయపూర్వక అభినందన మందారమాల. భవిష్యత్తులో అత్యున్నత పదవు లధిరోహించాలని కోరుకుంటున్నాము.

పందిళ్లపల్లి పట్టాభిరామిరెడ్డి
పందిళ్ల పల్లి అరుణమ్మ


## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికీ విడిపించని వస్తువులు : –

1. జి. మాణిక్యమ్మ పి.బి.యల్. నెం. 137 / పి. జి. ఆర్ 19.6.18A ఏ సిటి వి నగర్ రోడ్డు, తిరుపతి వారి తాలుకు కాలపరిమితి గడచినప్పటికీ 5.1.90 తేది నుండి 25.10.91 వ తేదీ వరకుగల విడిపించని వస్తువులు 25.10.91 వ తేదీ ప్రొద్దున 10.00 గం॥ల నుండి 19.6.18A , ఎసిటివి. నగర్‌రోడ్, తిరుపతిలో బహిరంగముగా వేలము వేయబడును.

2. పి.యల్. మహేంద్రకుమార్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెం 80, 224 పెద్ద కాపు వీధి, తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడచినప్పటికీ 3.1.90 నుండి 11.8.90 తేది వరకు గల విడిపించని వస్తువులు 29.10.91 తేది మధ్యాహ్నం 1 గంట నుండి 224 పెద్ద కాపువీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) ప్రశాంతి అండ్ కో పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెం 91, పెద్దకాపువీధి, తిరుపతి తాలూకు కాలపరిమితి గడచినప్పటికీ 4.7.89 తేది నుండి 28.7.90 తేది వరకుగల విడిపించని వస్తువులు 29.10.91 తేది ఉదయం 10 గంటల నుండి పెద్దకాపు వీధి, తిరుపతిలో పై అడ్రసు గల వారి అంగడిలో బహిరంగముగా వేలము జరుపబడును:

4) పి. నరేంద్ర కుమార్ పాన్ బ్రోకర్స్ . పి.బి.యల్ నెం 15 , 762 ఎ జ్యోతి నగర్ తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడచినప్పటికీ 19.6.90 తేది నుండి 17.9.90 వరకు గల విడిపించని వస్తువులు 30.10.91 తేది ఉదయం 10 గంటలనుండి 762 ఎ, జ్యోతినగర్ తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) బి.పేమారామ్ పాన్‌బ్రోకర్స్‌పి.బి. యల్ నెం 54, 250 చిన్నబజారు వీధి, తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడచినప్పటికి 6.9.89 నుండి 8.3.90 తేది వరకు గల విడిపించని వస్తువులు 5.11.91 తేది ఉదయం 10 గంటలనుండి 250 చిన్న బజారువీధి తిరుపతిలో బహిరంగముగా వేలముజరుపబడును.

6) వి.ఎ.కన్నాచారి సన్స్‌పాన్ బ్రోకర్స్ పి.బి.యల్ నెం 170, 74 బజారువీధి, తిరుపతి వారితాలూకు కాలపరిమితి గడచినప్పటికి 26.10.89 తేది నుండి 12.10.90 తేది వరకుగల విడిపించని వస్తువులు 9.11.91 తేది ఉదయం 10 గంటలనుండి 74 బజారువీధి తిరుపతిలో బహిరంగముగా వేలముజరుపబడును.

కె.వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన
వేలముదారు

## ప్రకటన

ఇందువల్ల యావన్మందికీ తెలియ చేయడమేమనగా :–

నేను లోగడ 6.8.90 తేదీన నెల్లూరు జిల్లా ముత్తుకూరు మండలము పిడతాపోలూరు గ్రామ కాపురస్థుడు గూటూరు రోశయ్య కుమారుడు శ్రీహరి రావుగారి వద్ద వారితాలూకు పిడతా పోలూరు గ్రామములోని య 5.00 ల మాగాణి భూమిని రూ 1,40,000 లకు విక్రయ అగ్రిమెంటు ద్వారా కొనుగోలు చేసియున్నాను.

ఈ రోజు అనగా 7.10.91 తేదీన సదరు శ్రీహరి రావు వద్ద BANKERS CHEQUE ద్వారా రూ 1,40,000 / - అక్షరముల ఒక లక్షా నలభైవేలం రూపాయలు తీసుకొని సదరు భూములను తిరిగి శ్రీహరిరావుగారికి స్వాధీన పరచడమైనది.

సదరు విక్రయ అగ్రిమెంటు ఎక్కడనో పడిపోయినది. కనబడుటలేదు. సదరు తే 6.8.90 ది గల అగ్రిమెంటు ఎవరికైనా దొరికిన యెడల ఈ క్రింది నా అడ్రసుకు చేర్చవలసినదిగా కోరుచున్నాను. అట్లు చేర్చిన యెడల వారికి తగు పారితోషికము ఇవ్వగలనని కూడా తెలియచేయుచున్నాను.

7.10.91 దువ్వూరు అనిత
D/o ఆదినారాయణ రెడ్డి
పొట్టెంపాడు గ్రామము
ముత్తుకూరు మండలము,
నెల్లూరు జిల్లా.

## నెల్లూరు 4వ అదనపు జిల్లా మునిస్ఫ్ వారి కోర్టులో

O.S. No. 616/90

Indian Bank, Nellore
Represented by its Branch Manager, వాది
Vs
T.Sai Gopal &another ప్రతివాదులు

To.
T.జయారెడ్డి
S/o లక్ష్మణ రెడ్డి,
గడ్డం వారి వీధి,
నెల్లూరు టౌన్.

ఆక్షేపణల నోటీసు

పై నెంబరు దావా 4.11.91 తేదికి పై ప్రతివాది నోటీసు నిమిత్తము వాయిదా వేయబడిఉన్నది. ఆ రోజు ఉదయం 10 గంటలకు మీరుపై కోర్టుకు హాజరయి మీకుగల ఆక్షేపణలను తెల్పుకొనని యెడల మీ పరోక్షములో దావా తీర్మానించబడును.

కొండూరు శేషారెడ్డి
వాది తరపు వకీలు

## సవరణ

27.9.91, 4.10.91 జమీన్‌రైతు పత్రిక 8 పేజి మొదటి, రెండవ కాలాంలో కె.వి. రామకృష్ణారావు బహిరంగవేలం ప్రకటన
1. అయిటం నం .2లో పి.బి.యల్ నెం. 7500 బదులు నెం. 75.
2. అయిటం నం. 8 లో కామయ్య అండ్ కో బదులు కామధేను అండ్ కో. అని
3. అయిటంనం 12 లో జి. పోకర్ రామ్ పటేల్ బదులు జి. ఫోకల్ రామ్ పటేల్ అని సవరించు కోమని మనవి.

మేనేజరు
జమీన్ రైతు

## సినిమా

(7 పేజీ కొరవ)

"కార్యదర్శి" చిత్రంలో కోటని నాయిక సురేష్, ఆంటిక, కోట శ్రీనివాసరావు ఇతర పాత్రధారులు. దర్శకత్వం: కోయిన సుబ్బారావు.

### "భామలారా ! భలేమొగుడు కావాలా?"

లోగడ " ఇద్దరు పెళ్ళాం ముద్దుల పోలీసు " చిత్రం తీసిన సుమిత్ర [illegible] తీయబోతున్నారు. ఇదికూడా హాస్య చిత్రమే. రేలంగి నరసింహారావు దర్శకుడు. సురేష్, దివ్యవాణి నాయకా నాయికలు.

ఇప్పుడు ఏ నిర్మాతను అడిగినా కామెడీ చిత్రం తీయబోతున్నాం - అంటున్నారు. ప్రజలు దైనందిన సమస్యలను కాస్సేపు మరచి పోవడానికి కామెడీ చిత్రాలు అవసరమే. కాని, తయారయ్యేవన్నీ హాస్యభరిత చిత్రాలే అయితే, ప్రేక్షకులకు వెగటు కలిగే ప్రమాదముంది. అయినా, కామెడీ చిత్రాలలో ఎంతని వెరైటీ సృష్టించగలరు?

### " గోల్ మాల్ గోవిందం "

మల్లాది వెంకట కృష్ణమూర్తి నవల " వెడ్డింగ్ బెల్స్ " ఆధారంగా తాతినేని రామారావు దర్శకత్వంలో ఎ.వి. సుబ్బారావు నిర్మించే ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ 30వ చిత్రం " గోల్ మాల్ గోవిందం " రాజేంద్రప్రసాద్, అమాని, గొల్లపూడి మారుతీరావు, సుధాకర్, మాస్టర్ ఆనంద్, శ్రీలత, వై. విజయ, విజయదుర్గ, ప్రభృతి పాత్రధారులు.

### ఆశయాలన్నీ ఆచరణీయాలా ?

పరుచూరి బ్రదర్స్ ఇటుపైన రచనల్లో తమపంథా మారుస్తారట. ఇది వరకటిలాగా దర్శక నిర్మాతల ఒత్తిడులకు తల ఒగ్గే రచనలు సాగించరట. హింస, సెక్సు వంటి నెగటివ్ ఎలిమెంట్స్ తక్కువగా ఉన్న కథలనే అందిస్తారట. ఇలా చెప్పడం బాగానే ఉంది గాని , ఎంత వరకు నెగ్గుకు రాగలరనేది సందేహం. కాలప్రవాహాన్ని తట్టుకు నిలవడం సాధ్యమా ?

### దాసరి దర్శకత్వంలో " సుబ్బారాయుడి పెళ్ళి "

" వేంమీద కిళ్ళీ కొట్టు నడుపుకునే ఓ అమాయకుడి కోరికలు గుర్రాలయితే - అనే ప్రాతిపదిక మీద అల్లబడిన కథ, అన్నారు దాసరి నారాయణరావు. ఈయన దర్శకత్వం వహించే పై చిత్రంలో రాజేంద్రప్రసాద్ , ఐశ్వర్య, అల్లురామలింగయ్య, రామిరెడ్డి, శుభలేఖ సుధాకర్, బ్రహ్మానందం, బాబూ మోహన్, జయలలిత, మాగంటి సుధాకర్, నాగేష్‌బాబు నటిస్తారు. మాటలు: సత్యానంద్ సంగీతం : వాసురావు - సమర్పణ : ఎం. శ్యామ్‌సుందరరెడ్డి.

## సినీ దిన పత్రికలు

(7 పేజీ కొరవ)

లాభించేది అంతగా ఉండదు. ఇది ఆరోగ్యకరమైన పోటీ కాదని కొందరి అభిప్రాయం. అయినా, ఎవరిదారి వారిది. మొత్తంమీద తయారయ్యే చిత్రాల నాణ్యత ఎలా ఉన్నా వాటి గురించి ఉచితంగా దినపత్రికలలో విపరీతంగా పబ్లిసిటీ లభిస్తుంది.

### నెల్లూరీయుని ఇంట్లో దోపిడి

నెల్లూరీయుడు వెంగయ్య ఛాయాగ్రాహకుడు. ఈయనకు మద్రాసులో ఔట్ డోర్ యూనిట్ ఉంది. సెప్టెంబరు 25 రాత్రి డైరెక్టర్స్ కాలనీలోని ఈయన గృహంలోకి ఇద్దరు దొంగలు ప్రవేశించి , ఈయన భార్య సరోజను కత్తులతో బెదిరించి ఓ గదిలో కట్టిపడేశారు. బీరువాలోంచి 25 సవరు నగలు, 85 వేల రూపాయల రొక్కంతో పరారయ్యారు. మర్నాటి ఉదయం ఇంటికొచ్చిన వెంగయ్య బార్లాతెరిచిన ఇంట్లో భార్య కట్టిపడేసి ఉండడంచూసి గాభరా చెందాడు. ఆ దోపిడీ దారుల కోసం కోడంబాకం పోలీసులు గాలిస్తున్నారు.

### " పెళ్ళినీకు శోభనం నాకు "

నటుడు నారాయణరావు నిర్మించే చిత్రం. నరేష్, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, వై. విజయ ఆదిగా గల వారు పాల్గొంటారు. దర్శకత్వం: నెల్లూరీయుడు పి.ఎన్. రామచంద్రరావు.

## విచిత్రమైన టైటిల్స్

విడుదలైన చిత్రాలలో ఎక్కువ శాతం పరాజయం చెందుతున్నా, కొత్త చిత్రాలకు అంకురార్పణలు ఇదివరకటికన్నా ఎక్కువగానే జరుగుతున్నాయి. ఇటీవల నమోదు చేయబడిన కొన్ని చిత్రాల పేర్లు ఎంత తమాషాగా ఉన్నాయో చూడండి ... శ్రీ విష్ణుపిక్చర్స్ " అసెంబ్లీ హీరో " సాయిజగత్ ప్రొడక్షన్స్ " పార్లమెంటు పాప " కె.సి.పి క్రియేషన్స్ " పిలకలూ రిపేట పిలక " , శ్రీ చంద్రా ప్రొడక్షన్స్ " సర్కారోడి అల్లుడు " ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ " గోల్‌మాల్ గోవిందం " ప్రియా ఆర్ట్ ప్రొడక్షన్స్ " గోల్ మాల్ గోపాలకృష్ణ " ఎం.ఆర్.పి. మూవీక్రియేషన్స్ " నాకు రెండో పెళ్ళాం కావాలి " సంచలన చిత్ర ఇంటర్నేషనల్ " రూట్ నెంబర్ 19/91 ", పద్మామూవీస్ " ఆవిడగారు " చిత్రలేఖన వారి " అదృశ్యం: శ్రీ రాజీవ ప్రొడక్షన్స్ " అత్త ఇంట్లో అద్దె మొగుడు " కిరణ్మయి సినీ క్రియేషన్స్ " చరాస్కానాతదాఖా " సాయికిరణ్ ప్రొడక్షన్స్ " చిలిపి పెళ్ళాం - చిరాకు మొగుడు : కీర్తి క్రియేషన్స్ " గద్దర్ " సుమన్ చిత్ర " గౌరమ్మా నీమొగుడెవరమ్మా " శ్రీ శుభోదయా ప్రొడక్షన్స్ " ఇల్లరికం అల్లుడు " శ్రీ విజయరామ ప్రొడక్షన్స్ " నరమేధం, స్టార్ ఇంటర్నేషనల్ ప్రొడక్షన్స్ " శిఖండి " క్రియేటివ్ కమర్షియల్స్ " టెర్రరిస్ట్ " కళాంజలి క్రియేషన్స్ " ఉమన్స్ కాలేజ్ "

## యదార్థగాథా చిత్రాలు

రేణిగుంట , బాలుపల్లి వగైరా అడవి ప్రాంతాల్లో గత తొమ్మిది నెలలుగా జరిగిన దాదాపు 13 హత్యలకు కారకుడు ఓ ఉన్మాదిగా పోలీసులు గుర్తించారు. ఆ ఆధారంతో గీయించిన అతని ఊహా చిత్రం పత్రికలో ప్రచురించబడింది కూడా. ఈ సంఘటనలను ప్రేరణ తీసుకుని విశ్వకర్మ ఫిలిమ్స్ పతాకంలో చంద్రకాంత్ పోతేదార్ నిర్మించే " అడవిలో అర్తనాదం " చిత్రంలో ఏసూరి రామ్మూర్తి అనే అతను ఉన్మాదిగా నటిస్తున్నాడు. ఇంకా 'పెంతకోభనం' అంజలి, ప్రసాద్ రెడ్డి వగైరా కొత్త కళాకారులతో పాటు పేరుమోసిన నటీనటులు కూడా పాల్గొంటారట. రచన, స్క్రీన్ ప్లే, దర్శకత్వం: ఎస్.వెంకటకృష్ణ

సాయం సీతమ్మఅనే గిరిజన స్త్రీ యదార్థ గాథను " మన్నెంలో మంగమ్మ " గా శ్రీ లక్ష్మి రవికిరణ్ ఆర్ట్ సంస్థ నిర్మిస్తున్నది. ఊర్వశి శారద, శరత్ బాబు, షణ్ముగ శ్రీనివాస్, బ్రహ్మానందం, చలపతిరావు, ప్రదీప్ శక్తి, బాబూమోహన్ ప్రభృత నటవర్గం. దర్శకుడు : ధవళ సత్యం.

### జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | - రూ 75-00 |
| ఆరునెలలకు | - రూ 40 -00 |
| విడి ప్రతి | - రూ 1-50 |


# శ్రీ నారాయణవనం రియల్ ఎస్టేట్

శ్రీ పద్మావతి కాలనీ, పొగతోట, నెల్లూరు.

ప్లాట్ల వివరములకు సంప్రదించండి.
శ్రీ ఐ. నవకోటి
కోణార్క్ టి.వి షాపు,
పినాకిని సూపర్ మార్కెట్
ట్రంకురోడ్, నెల్లూరు.
ఫోన్ : 27405

నెల్లూరుకు దగ్గరలో అందరికీ అందుబాటులో
అతి తక్కువ ధరకు వాయిదాల పద్ధతిలో ఇండ్ల ప్లాట్లు
నెలకు రూ. 200/- ల చొప్పున 25 నెలలు మొత్తము రూ 5000/- మాత్రమే

మొత్తం ప్లాట్లు 2800
సభ్యులు - 2800

మొదటి నెల బజాజ్ చేతక్,
పన్నెండోనెల హీరోహోండా
ఇరవై అయిదో నెల
బజాజ్ చేతక్

ప్రతినెల డ్రాలో 3 ప్లాట్లు
లక్కీ డ్రా ముగ్గురు
సభ్యులకు తీయబడును

1. పద్మావతి కాలనీ ప్లాట్లు నెల్లూరు పట్టణము కొత్తూరుకు ఉత్తరమున కలవు. 2. ప్లాట్ల విస్తీర్ణము 60 x 40 సైజు గల 33 1/3 అంకణముల ప్లాటు. వాస్తుకు అనుగుణంగా ప్రతి ప్లాటు కలదు. 3. విశాలమైన రోడ్లు, మంచినీటి వసతి, విద్యుత్, టెలిఫోన్ మరియు దేవాలయము వసతి కలదు. 4. మాకాలనీకి పడమర వైపున సింహపురి పబ్లిక్ స్కూల్ కలదు. 5. పొదలకూరుకు పోవు రహదారి వున్నందున బస్సు సౌకర్యము ఎల్లవేళలందు కలదు. 6. ప్లాటుకు దక్షిణవైపున 420 ఎకరముల విమానాశ్రయం కొరకు స్థల సేకరణ జరిగియున్నది.

వివరములకు సంప్రదించండి.
బి. గంగాధర రెడ్డి మునిసిపల్ కౌన్సిలర్,
మేనేజింగ్ పార్ట్నర్, పద్మావతి కాలనీ,
పొగతోట, నెల్లూరు. ఫోన్ : 27654



Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books Pvt, Ltd, Nellore